ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం : 21–10–'77

పింగళనామ సం. ఆశ్వీయుజ శు. దశమి

సంపుటము 71 సంచిక 5

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

పోస్టులో ఏడాది చందా రు. 41–60

ఆరు మాసాలచందా రు. 20–80

విడిప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ–520 003



## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :

నటి జయలక్ష్మి

[... మూర్తి]

# "ఈసారి అరెస్ట్ చేస్తే..."

[వీ రా జీ]

కొన్ని మాసాలుగా 'నన్ను అరెస్ట్ చేయండి' – అంటూ శ్రీమతి ఇందిరా గాంధీ చేస్తున్న సవాల్‌ని అక్టోబర్ మూడు సాయంకాలం డ్రమటిక్‌గా ఎదుర్కొన్నది జనతా గవర్నమెంటు. మర్నాటి మిట్టమధ్యాహ్నం వేళకి ఆమె 'కోర్టు'లో విడుదలై తన యింటికివచ్చి చుట్టూ చేరిన కాంగ్రెసు నాయకులను, వేలాది ప్రజలను ఉద్దేశించి "యీసారి యిలాంటివి అంటే నన్ను అరెస్ట్ చేయటం లాంటివి జరిగితే – మీరు యిక్కడికి నాదాకా రాకండి ఎక్కడికక్కడ మీ మీ పేటలలోనే ప్రదర్శనలుచేసి మీ అసమ్మతి తెలపండి" అని వాళ్ళందించిన గులాబీ దండలందుకొని హితవు చెప్పడంతో – అత్యద్భుతమైన నాటకీయ స్థాయి నందుకున్న "అరెస్టుల పరంపర" – యాంటీ క్లయిమాక్సుకి వచ్చేసింది!

పోలీసు లాకప్‌నుంచి– శ్రీమతి ఇందిరను జనాలు పోలీసులతో ముఖాముఖి పోరాటం సాగిస్తుండగా– పోలీసులు ఢిల్లీ నగర అదనపు న్యాయాధిపతి ఆర్. దయాళ్ యెదుట హాజరు పరిచారు. కాని పోలీసులు, సి.బి.ఐ. అధికారులు కూడా ఆమెను పోలీసు బద్రతా యేర్పాట్లుచేసి మరికొంచెం సేపటిలోనే యింటికి దిగబెట్టవలసి వొచ్చింది.

"శ్రీమతి ఇందిరాగాంధీ పై చేసిన ఆరోపణలకు ప్రాతిపదికగా నమ్మదగ్గ తగినన్ని ఆధారాలు లేవు పొమ్మని" మాజిస్ట్రేటుగారు ఆమెను విడుదల చేశారు.

"లాకప్‌లో మిమ్మల్ని పోలీసులు ప్రశ్నించారా?" అంటే "లేదు"అని ఆమె విలేఖరులకి చెప్పారు. గులాబీ దండలు, నినాదాలు వీటిమధ్య ఉక్కిరి బిక్కిరి అయిన శ్రీమతి గాంధీ జనతా హోంమంత్రి చరణ్‌సింగును పేరు పెట్టకుండా ఉటంకించి "కొంత మంది జనతా నాయకులు నన్ను అరెస్టు చేయడమే ప్రజలకు వాళ్ళు యిచ్చిన వాగ్దానాలు నెరవేర్చడంగా భావిస్తున్నార"ని అన్నారు.

ఇందిరమ్మగారు పార్టీలోనూ దేశంలోనూ కూడా అంత తేలికగా ఎదుర్కొనదగ్గ 'శక్తి',కాదన్నది రుజువైందని వెంటనే



హైడ్రామా...

కొందరు అనగా– దేశంలో ప్రజాస్వామ్యం– కోర్టులు వున్నాయి కనుకనే ఆమె– గంటలమీద తిరిగి విడుదలైంది అని మరి కొందరు వ్యాఖ్యానించారు– అయితే ఇందిరా ప్రియ వర్కిని మీద ప్రభుత్వం ఎగా–నిఘా యింతటితో ఆపివేస్తుందని మార్చి 21 నుంచి దేశంలో జరుగుతున్న సంఘటనలను తరచి చూచినవాళ్ళెవ్వరూ అనుకోరు...ప్రభుత్వం హైకోర్టుకి అప్పీల్ చేసింది.

---

## మంత్రుల అరెస్టులు

అక్టోబరు 3 సోమవారంనాడు మాజీ కాంగ్రెసు మంత్రులు కె. డి. మాలవీయా, హెచ్. ఆర్. గోఖలే, డి. పి. చటోపాధ్యాయ, పి. సి. సేథీలను నాలుగు అవినీతి కేసులకు సంబంధించి సి. బి. ఐ. అధికారులు అరెస్టు చేశారు.వారితోపాటు ఆర్.కె ధవన్, యిన్‌పాల్ కపూర్‌లను మరి యిద్దరు మాజీ ప్రభుత్వ అధికారులు బి. బి. వోహ్రా, ఎన్. ఎం. అగ్రవాలాలను ప్రముఖ పారిశ్రామిక వేత్తలు ఆర్. పి. గోయెంకా, ఎం. వి.అరుణాచలం ప్రభృతులను అరెస్టు చేశారు. అరెస్టు కావలసిన కె. కె. బిర్లా విదేశాలలో ఉన్నందున సాధ్యం కాలేదు.

---

### "బేడీలు తేలేదా?"

# 10 వేల సంచలన క్షణాలు!

[అక్టోబర్ 3 సోమవారం సాయంకాలం 5 నుంచి రాత్రి 8 గంటలదాకా: న్యూఢిల్లి వెల్లింగ్‌టన్ క్రెసెంట్ రోడ్డు 12వ నెంబరు యిల్లు:]

**పోయినసారి ఎన్నికల్లో రెండు కంపెనీల దగ్గిర తీసుకున్న 104 జీపులను ప్రచారం కోసం వాడుకొని-వాటిమూల్యం ఎ.ఐ.సి.సి. చేత చెల్లింపచేయని** నేరం మీద– ఒక ఫ్రెంచి కంపెనీకి పెట్రోలియం యింధన వాయువులకు సంబంధించిన కాంట్రాక్టుని ఎక్కువ రేటుకు యిప్పించారన్న ఆరోపణలమీద భారత మాజీ ప్రధాని ఇందిరాగాంధీని ఆగస్టు 15 నుంచి అక్టోబర్ 2 గాంధీ జయంతి దాకా జరిగిన హోరా హోరీ తర్జన భర్జనల అనంతరం– చౌధురీ చరణ్‌సింగ్‌గారి పంతంమీద–మొరార్జీ భాయిదేశాయి,బాబూ జగజ్జీవన్‌రావ్‌ల జనతా గవర్నమెంటు ఎట్టకేలకు అరెస్ట్ చేసింది!

సరిగ్గా 10 వేల సంచలన క్షణాలు – పోలీసులకు శ్రీమతి ఇందిరాగాంధీ అభిమానుల నినాదాలమధ్య పదివేల యుగాలుగా గడిచాయి – సి. బి. ఐ. అధికారులు ఆమెను అరెస్టు చేయవచ్చామన్న వారెంటు వినిపించటానికి ఆరిపోతున్న గొంతులో ధైర్యం

(41 వ పేజీ చూడండి)

## రాజా 'కాలమ్'

# "యూనివర్సిటీ యూనియన్‌ల ఎన్నికలలో

### మంచినీళ్ల ప్రాయంగా ఖర్చయ్యే పైకం ఎక్కడిది ??"

"మీ యూనివర్సిటీ స్టూడెంట్సు యూనియన్ ఎన్నికలలో పైకం విచ్చలవిడిగా ఖర్చు అవుతోందే? అదంతా ఎక్కడిది ?" అని భారత ప్రధాన మంత్రి మొరార్జీ దేశాయ్‌గారు సెప్టెంబర్ 26న భారత రాజధానిలో ఢిల్లీ యూనివర్సిటీ ప్రాంగణంలో 10 వేల మంది విద్యార్థులని సూటిగా అడిగారు.

ఇదే ప్రశ్న యివాళ ఎందరో మామూలు మనుషులు కూడా వేస్తున్నారు— ప్రధాన మంత్రి 'యూనియన్' ప్రారంభోత్సవానికి హాజరై "మీ యూనియన్‌ల ఎన్నికలు— ఎన్నికల రాజకీయాలు—అందులో కీలకపాత్ర వహించే రూపాయిలు — యివన్నీ కూడా "అవినీతి" అనే నిర్వచనం లోకే వస్తాయి సుమా? అని హెచ్చరిస్తూనే—



ఢిల్లీ యూనివర్సిటీ విద్యార్థుల యూనియన్ ప్రారంభోత్సవంలో ప్రధాని. గడ్డం ఉన్నాయన యూనియన్ ప్రసిడెంట్ వి. కే. గోయెల్.

ఇట్లాంటి చౌకబారు పాలిటిక్స్‌లో మీరు ఏదో ఒక పక్షం వహించి ఆహుతి ఐపోతూ దేశంలో లంచగొండి తనాన్ని, అవినీతిని నిర్మూలించమని ఎలుగెత్తి అరవలేరు" అని కూడా చెప్పిపోడిచారు శ్రీ మొరార్జీగారు.

ఢిల్లీ నుంచి కన్యాకుమారి దాకా కూడా యూనివర్సిటీలలో— 'అశాంతి' అపరిమితం రగిలిపోతున్నాయి— మూతిమీద మీసాలకు బదులు కొంతమంది యువకులు రాజకీయాల కుళ్లు కావేషాలను పెంచుకుంటున్నారు— ఎందుకీ ఆందోళన ? అశాంతి ? "గచ్చపిక్కలు తీసే పిల్లలు"గా మాపిల్లలై పోతున్నారెందుకని? అని వాపోయే తల్లిదండ్రు లెందరో వున్నారు.

## సుప్రీం స్టార్!



'ఎలిజబెత్ టేలర్' లాగ యెవర్‌గ్రీన్ హీరోయిన్‌లు మరెవ్వరూలేరు..."హాలీవుడ్ క్లియోపాత్రా"గా వాసి కెక్కిన "లిజ్" ఒక్క సినిమాలో నటించడానికి పదిలక్షల డాలర్‌లు తీసుకుంది ... యింత సొమ్ము బ్లాకుగా గాని . బ్లాకు + వైట్‌గా గాని తీసుకున్న 'మగాడె'వడూలేడు ప్రపంచంలో. "మళ్లీ పెళ్లిళ్లు" చేసుకోడంలోను 'డైవోర్సు' చేసినవాణ్ని మళ్లీ 'కవ్వించి' కళ్యాణం చేసుకోడంలోనూ కూడా యీమెదే రికార్డేమో? అంత రూఢిగా చెప్పలేం గాని 'స్టార్ వాల్యూ'కి మాత్రం "లిజ్"కి సాటిలేరు! పోటీ కూడా లేరు...

ఎలిజబెత్ సినీ రాణి!

"క్యాడిలాక్" కార్ల కంపెనీ వాళ్లు యీ మధ్యనే ఒక "సినిమా ప్రకటన" తయారు చేసారు. ఈ క్యాడిల్లాక్ అడ్వర్టయిజ్‌మెంటు చిత్రంలో ఎలిజబెత్ టేలర్‌ని కనపడమన్నారు! ఆవిడ అందుకు యించక్కా ఒప్పుకుంది. ఒకే ఒక్క "నిమిషం" పాటు ఆ ప్రకటన వెండితెర మీద చూపించబడుతుంది...దానికోసం ఆమె ఒక్క "రోజు" మాత్రం నటించింది. ఎంత తీసుకొందో తెలుసా? ఏడులక్షల యాభై వేల డాలర్‌లు! ఆమె వయస్సు 47 సంవత్సరాలు మాత్రమే! ఆమె పెద్ద కొడుకు వయసు 25 సం,లు.

మొరార్జీగారి ఆవేదనలో వీళ్లందరి ఆందోళనా కూడా మిళితమై వుంది!

ప్రధానిమంత్రికి దేశంలో వున్న అన్ని యూనివర్సిటీలలోను ఏదో రకంగా 'స్ట్రయికులు'- హంగర్ స్ట్రయికులు- జరగటం- నిరవధికంగా అవి మూతపడిపోవటం- ఫస్టు టెర్మ్ అయిపోవస్తున్నా యింకా ఫస్టు లెస్సన్ కూడా మొదలుకాని కాలేజీలుండం యివన్నీతెలియకుండా వుంటాయా? తెలుస్తూనే వుండాలి. ప్రతీచోట వైస్ ఛాన్సలర్‌కి విద్యార్థులకీ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనడం ఎందుకు జరుగుతున్నది?!

ఢిల్లీ యూనివర్సిటీ - లక్ష మంది స్టూడెంట్‌లున్న రాజధాని యూనివర్సిటీ - ఈ మధ్య యిక్కడ యూనియన్‌కు జరిగిన ఎన్నికలు పార్లమెంటు ఎన్నికలా యివి? అన్నంత 'కురుక్షేత్ర సంగ్రామ' స్థాయిలో జరిగాయని అక్కడి పత్రికలనిండా వార్తలు వెలువడ్డాయి! కోర్టులకు వెళ్లడం - రిగ్గింగ్ జరిగిందనడం - దొంగ బ్యాలట్ పత్రాలున్నాయనడం వోహో - ఒకటేమిటి ఎన్నికల కలుషిత వాతావరణం అంతా అక్కడ తాండవించింది!

సెప్టెంబర్ 13న ఢిల్లీలో విద్యార్థులు ''ఆంద్రోద్యమ ఉధృతి'' లాంటిదాన్ని అక్కడ పౌరులకు రుచి చూపించారు - ఢిల్లీ సిటీ సర్వీసు బస్సులను ఎక్కడివాటిని అక్కడ ఆపి - మనుషుల్ని దింపేసి - ఖాళీ బస్సులను ఎత్తుకుపోయి కాలేజీ ఆవరణలో 'బందులదొడ్లో గొడ్లను పారేసినట్లు' పారేశారు ... వైస్ ఛాన్సలర్‌కి, ప్రిన్సిపాల్‌వాళ్లకు మా కోర్కెలు చెప్పాం, అవసరాలు విన్నవించాంగాని-వాళ్లు నిమ్మకి నీరెత్తినట్లూరుకున్నారు - అందుకే మేం ప్రత్యక్ష చర్యకు పూనుకున్నాం అంటారు విద్యార్థులు. మొరార్జీగారు యిటువంటి 'దారిమళ్లింపు' వ్యవహారాలనికూడా ఖండించారు - అంతేనా - టీచర్‌లు వారి ధర్మాన్ని బాధ్యతని నిర్వర్తించకపోడంలోనే - యీ అసంతృప్తికి అశాంతికి ఎక్కువ కారణం వుందని గట్టిగా చెప్పారు! రాజకీయాలను నేర్చుకోమంటే- రాజకీయవాదుల చేతుల్లో ''పార్టీ పశువులై'పోమన్న అర్థం వుందా? అని అడిగిన మొరార్జీగారిని డౌన్ డౌన్ అన్న

(36వ పేజీ చూడండి)












"డబ్బేమయినా ఉంటే చూడు గురూ."

జేబులోంచి రూపాయినోటు తీసి కళ్ళతో చూసి "చూశాను" అన్నాడు రావు.

"అదేమిటి?" అన్నాడు మూర్తి తెల్లబోతూ.

నవ్వాడు రావు. "గారడీవాడు తమాషా చేసేముందు 'కళ్ళు మూసుకోండి..చప్పట్లు కొట్టండి' అంటాడు. అలాగే నువ్వుకూడా ఏమయినా చేయబోతున్నావేమో ననుకున్నాను."

మూర్తికూడా నవ్వేశాడు.

"అది కాదు గురూ, నాకు డబ్బు కావాలి. ఏమయినా సర్దగలవా అని."

"అలా ఏడవకూడదూ—వెధవ లౌక్యం దేనికి?... లేదు."

"లేదంటే కాదు చూడాలి. అంతే!"

"అవునురా లేదంటుంటిని కదా!"

కుర్చీ లాక్కుని పక్కన కూర్చున్నాడు మూర్తి "నువ్వు కాదంటే మునిగిపోతాను గురూ, ఎలాగోలా ఈ సాయం చేయాలి."

"ఇప్పటికొచ్చావు దారిలోకి — డబ్బడగవలసిన పద్ధతి ఇది. ఎంత కావాలేమిటి?"

"మూడొందలు."

"వందలే!"

"అవును."

"ఎందుకో?"

సిగ్గుపడ్డాడు మూర్తి.

"ఫరవాలేదు చెప్పరా."

"మా ఆవిడతో మద్రాసు, హైదరాబాదు తీసుకు వెడతానని వాగ్దానం చేశాను."

"అయితే అప్పుచేసి ఆ వాగ్దానం నెరవేర్చుకోవాలా ఏమిటి?"

నవ్వాడు మూర్తి. "మా ఆవిడ ఇప్పుడు ఉత్తమనిషి కాదు గురూ, నాలుగో నెల."

"కంగ్రాట్స్ మై బాయ్! కనుక తప్పకుండా నీ వాగ్దానం నెరవేర్చుకోవాలన్న మాట! ఆల్‌రైట్ అయితే నన్నడిగి ఉపయోగం ఏముంటుందిట — పది, ఇరవయి మందిని అడిగితేగాని!"

"తెలుసుగాని ఇవ్వగలిగిన వాళ్ళు లేరన్నారు."

"అయితే దండయాత్ర అయిపోయిందన్నమాట! నాగేశ్వరరావు, మోహనరావు, రామేశ్వరశాస్త్రి..."

అతని జాబితా పూర్తికాకుండానే మధ్యలోనే అందుకున్నాడు మూర్తి, వాళ్ళ సమాధానాలు వరుసగా "నా దగ్గరా — డబ్బా", "ఎన్నడిగితే బావుండేదోయ్", "ఈ నెల







సింగరాజు రామచంద్రమూర్తి

దాటితే చూడగలను" అని.

నవ్వేశాడు రావు. "అయినా పట్టు వదలని విక్రమార్కుడిలా నా దగ్గర ప్రయత్నం చేస్తున్నావు. అవునా."

"మరింకెవరిని అడగను. అన్నట్టు తిరుపతికూడా ఉంది మా కార్యక్రమంలో."

"వెధవ తెలివికి పోకు — దేముడి పేరు చెబితే ఇవ్వగలవాడిని "ఊరికేమాత్రం ఇవ్వనా?... సరే చూద్దాం"...

నాలుగు రోజులు పోయాక రావు చుట్టూ జనం పోగయ్యారు. అతను వేసుకున్న చొక్కాని రకరకాల పరీక్షలు చేస్తున్నారు వాళ్ళంతా.

"ఎంత బావుందో!" అన్నారొకరు.

"ఎక్కడిది గురూగారూ?"

"ఆఁ, మద్రాసులో మా బావమరిది ఉంటే తెప్పించాను. స్మగుల్డ్ వస్తువుల్ని గవర్నమెంటువారు పట్టుకున్నవి స్టోర్సులో పెట్టి అమ్ముతున్నారక్కడ. ఇది జపాన్ తయారీ — మీటర్ ఇరవయిరెండు రూపాయలు."

కనుబొమలు ఆశ్చర్యంతో పైకిలేచాయి.

"ఇటువంటిది మన షాపుల్లో నలభయిరెండు రూపాయిలు!"

"స్వార్థపరుడివయ్యా రావుగారూ, అచేత్తో మాక్కూడా తెప్పిస్తే నీదేంపోయిందో?"

నవ్వాడు రావు "సర్లె, తీరా తెప్పించి ఎవరూ వద్దంటే నేను తలంటుకోవాలి" అన్నాడు.

"అక్కడికి మేమంతా ఖర్చు పెట్టలేనివాళ్ళం — సగానికి సగం ఖరీదులో వస్తుంటే కొనని దెవరు?"

"మీక్కావాలా చెప్పండిప్పుడు పోనీ."

"కావాలి", "కావాలి" అని చాలా గొంతులు పలికాయి.

"అయితే ఒక పని చేద్దాం. మన శ్రీధరమూర్తి నెలాఖరుకి వెడుతున్నాడు మద్రాసు!"

"సరే, హనీమూన్ ట్రిప్పుకి పోతున్నవాడిని..."

"తన్ని నాకొదిలేయండి. ఆ మాత్రం సాయం చేయకపోతే డొక్క చింపెయ్యనూ!"

ఉదయంపూట కలవు పెట్టిన మూర్తి మధ్యాహ్నం ఆఫీసుకివస్తూనే అతన్ని తేనెటీగల్లా చుట్టేశారు.

విషయం అర్థమయాక ఒళ్ళు మండిపోయింది మూర్తికి. గబగబ రావు దగ్గరకెళ్ళి "ఇదా నువ్వు చేసే నిర్వాకం. శుభమా అంటూ మేం పోతుంటే ఈ బాదరబందీ అంటగడతావా నాకు?" అన్నాడు విసుగ్గా.

"ఏడిశావు, చెప్పినట్టు వినాలిసిందే! ఎవరెవరెంత ఇస్తారో లిస్టురాసి మరీ తీసుకో! వాళ్ళకి కావలసిన రంగులు ఏమిటో రాసుకో. రాత్రి ఎనిమిదింటికి రెడీగా ఉండు మీ ఇంటికి వస్తాను. ఇక పో" అన్నాడు రావు.

సాయంత్రానికి మూర్తి దగ్గర అయిదు వందలదాకా పోగయింది. ఇంటికి వెళ్ళా! ఇద్దరు ముగ్గురు ఇంటికివచ్చి కావలసిన రంగులు చెప్పి డబ్బిచ్చి వెళ్ళారు.

రావు రాగానే అడిగాడు మూర్తి "ఏమిటి నాయనా ఈ లీలలు ?" అని.

కిళ్ళీ వాసన ఘుమ ఘుమలాడగా చిద్విలాసంగా నవ్వాడు రావు. "భక్తుడిని ప్రాధేయపడ్డావుగద! ఇదంతా నీ ప్రయాణానికి పెట్టుబడి! "ఇప్పుడమ్మడం మానేశారుట" అని చెబుతావు నువ్వు తిరిగి రాగానే."

ఆశ్చర్యపోయాడు మూర్తి "తెలివంటే నీది గురూ!... తిరిగి వచ్చాక మాత్రం ఇవ్వద్దూ ?',

"దానిదేముంది. నీదగ్గరనుంచి డబ్బు తిరిగి వచ్చిందే చాలుననుకుంటారు వాళ్ళు. మెల్లగా జీతంలో ఇద్దువుగాని. పద సినిమాకి తీసుకెళ్ళాలి నన్ను!"

యాత్రంతా అయ్యాక ఒక షర్ట్ పీస్ రావు కిచ్చాడు మూర్తి "గురువుగారికి కానుక" అంటూ.

నవ్వాడు రావు "ఏడిశావుగాని నువ్వు కుట్టించుకో. ఉపయోగించుకునేప్పుడు స్వ, పర బేధాలుండకూడదు. ప్రభువు, భృత్యుడు తేడాలుండకూడదు. నాకిచ్చావని తెలుస్తే వాళ్ళు ఏడుస్తారు" అన్నాడు.



సీరియల్

# శాంతి తీరం

## చక్కిలం విజయలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

ఈ మధ్య వసంత మాధవి ఇంటికి రాలేదు. అసలు వచ్చిందికూడా ఒకటి రెండుసార్లు మాత్రమే.

గేటుదాటి లోనికి అడుగు పెట్టగానే ఆశ్చర్యపోయింది వసంత. గేటు ఆర్చీ మీద కాశీరత్నం తీగ ఒత్తుగా అల్లుకుంది. కాంపౌండు గోడ పొడవునా ఎరుపు తెలుపు రంగుల్లో మార్చి మార్చి మందారాలు, నందివర్ధనాలు విరగబూసి వున్నాయి. గేటు పక్కనే లోపలివైపు మల్లెపొద. నిండుగా పూచి 'మల్లెపూల బుకే'లా వుంది. సన్నటి కాలిబాట కిరువైపులా రంగు రంగుల జినియాలు విరగబడి నవ్వుతున్నాయి. ఎడమ ప్రక్కన కస్తూరి చామంతి మళ్ళు. కుడివైపు కొద్దిమేర గుండ్రటి షేప్‌లో పచ్చిక పెంచి, కత్తిరించబడి వుంది. వరండా రెండు చివరల్లో చూరుమీదికి పాకిన బోగన్ విల్లాలు పూశాయి. వరండా మెట్ల కిరువైపులా మనీప్లాంట్ పాకివుంది పైకి. మెట్లమీద కుండీల్లో లిల్లీలు. కాంపౌండంతా పూలతోపులా సువాసనలతో, తుమ్మెదలతో కన్నులపండువుగా వుంది. మెట్లెక్కి వరండా మీద కాలు మోపింది, వరండా పొడవునా చూరుమీంచి వేళ్ళాడదీసిన చిన్న చిన్న కుండీల్లోంచి గుంపులుగా తొంగి చూస్తున్న టేబుల్ రోజాలను చూస్తూ. వరండాలో ఇరువైపులా పేం కుర్చీలు. మధ్యగా చిన్న టీపాయ్ మీది ఫ్లవర్‌వాజ్ లోని తాజా గులాబీలను చూస్తూ సన్నగా కదులుతున్న తెరను తొలగించుకుని హాలు లోకి నడిచింది వసంత. మాధవి కనిపించ లేదు. కుడివైపునున్న డ్రాయింగ్ రూంలోకి వెళ్ళింది. అక్కడా లేదు మాధవి. వంట గదిలోనూ, పెరటోనూ లేదు. తిరిగి డ్రాయింగ్ రూంలోకి వచ్చి కుర్చీలో కూర్చుంది ఆలోచిస్తూ. తలుపులన్నీ తెరిచిపెట్టి ఎక్కడికి వెళ్ళినట్టు? తన దగ్గరికే వచ్చిందా? అలాగైతే ఎదురు పడాలి కదా తనకు? ఎక్కడికైనా కానీ తలుపులు తీసిపెట్టి ఎందుకు వెళ్తుంది?

వసంత చూపు ఒకచోట నిలిచింది. గోడలో వున్న చిన్న తలుపుల అల్మెరాకు

**జరిగినకథ 8 :** గమ్యం తెలియకుండా ప్రయాణిస్తూ రైల్లో తారసిల్లిన మాధవిని తనతోపాటు తీసుకొస్తాడు శ్రీనాథ్. మాధవి, శ్రీనాథ్ భార్య వసంత స్నేహితులు. పెళ్ళి కాకుండానే గర్భవతయిన మాధవి వసంత ఇంట్లోనే వుండిపోతుంది. బిడ్డనుకన్న మాధవి కాలక్షేపంకోసం అంటూ పట్టుపట్టి వుద్యోగంలో చేరుతుంది. వేరే ఇల్లు తీసుకుని వెళ్ళిపోతుంది మాధవి. వసంత పట్టుదలమీద తన జీవితంలో చీకటిని వదలిపోయిన సంఘటనలను గురించి చెప్పటం ప్రారంభిస్తుంది మాధవి. బి. ఏ. చదువుతున్న నరేంద్రతో పరిచయమౌతుంది మాధవికి. నరేంద్రకు ప్రేమభిక్ష పెడుతుంది మాధవి. మాధవి నరేంద్రలు రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుంటారు. స్నేహితుడి పెళ్ళికంటూ వెళ్ళిన నరేంద్ర జీప్ ప్రమాదంలో మరణిస్తాడు... ... శ్రీనాథ్ మేనత్తకొడుకు కుమార్ వస్తాడు. మాధవి విధవ అని తెలిసి బాధపడ్డాడు కుమార్. నేను మిమ్మల్ని వివాహం చేసుకుంటాను అని అడగాలనుకుంటున్న కుమార్‌కి పరోక్షంగా తన విముఖత తెలియచేస్తుంది మాధవి.

**అందమైన సిల్కు కర్టెన్ వేళ్లాడుతోంది. అంత చిన్న తలుపుల అల్మైరాకు కర్టెన్ అవసరమేమిటి? ఏముంది లోపల? కుతూహలంగా లేచివెళ్లి** కర్టెన్ తొలగించింది **వసంత. ఆశ్చర్యం!** తలుపులకు తాళం **కూడా** వేసి వుంది! ఇంత జాగ్రత్తగా, పెట్టెలో కాకుండా ఈ అల్మైరాలో దాచవలసినంత విలువైన వస్తువేముంది మాధవి దగ్గర!! చీరెలు మాత్రమే కదా? అవి మామూలుగా పెట్టెలో పెట్టుకోవచ్చు. పుస్తకాలకు షెల్ఫ్ వుండనే వుంది. వసంతలో కుతూహలం పెరిగింది. ఎలాగైనా అందులోవున్న వస్తువేమిటో చూడాలనే ఆసక్తి కలిగింది. తాళం పెద్దదేమీ కాదు. చిన్నదే. లాగి చూసింది. ఊహూ, రాలేదు. మాధవి వచ్చేదాకా ఆగలేకపోయింది వసంత. అదేమిటో చూడాలనే కుతూహలం నిలువనీయలేదు. ఏదైనా సన్న మేకు లాంటిది దొరుకుతుందేమోనని అటూ ఇటూ చూసింది. మరో గూట్లో ఇంటిబయట గుమ్మానికి వేసే పెద్ద తాళమూ, ఆ తాళం రంధ్రంలో తాళం చెవుల గుత్తి వున్నాయి. గుత్తికి మూడు తాళం చెవులున్నాయి. ఒక చెవి తాళంలో గుచ్చే వుంది. మిగతావి ఒకటి పెద్దదీ, మరోటి ఆ అల్మైరాదీ కాబోలు. వసంత సంతోషంగా తాళంలోంచి గుత్తి తీసుకుని అల్మైరా దగ్గరకు వెళ్లి, తాళం తీసి, తలుపులు తెరిచింది. తెరిచి...నిశ్చేష్టురాలై నిలిచిపోయింది!

ఆ అల్మైరాలో...అందమైన యువకుడి ఫొటో వుంది! దాని ముందు తెల్లని తాజా గులాబి!

'ఇదేమిటి! ఇతను...ఇతను ... ఇతను శ్రీనాధ్ తీసుకు వచ్చిన ఇంజనీర్! మిస్టర్ వర్మ!'

తల తిరిగినట్లయింది వసంతకు.

మాధవికీ, వర్మకూ ఏమిటి సంబంధం? ఇతను నరేంద్ర కాదు కదా? అదెలా సంభవం? చనిపోయిన నరేంద్ర బ్రతికి వస్తాడా? వచ్చి, నరేంద్రవర్మ అవుతాడా? ఏమిటీ మిస్టరీ? ఈ ఫొటో మాధవి కెక్కడిది? ఆనాడు మాధవి ఒట్టిచేతులతో కేవలం కట్టు గుడ్డలతో కదా వచ్చింది?!

ఆమె తలలో పెద్ద గందరగోళం బయలుదేరింది అంతులేని ఆలోచనతో అర్థంకాని సమస్యతో తల బ్రద్దలవుతూండగా నడవలేక తూలుతూ వరండాలోకి వచ్చింది వసంత. ఆమె కళ్లు చీకట్లు కమ్మాయి. కాళ్లు తడబడ్డాయి. ఆసరా కోసం చేతులు ముందుకు చాపింది గానీ ఏమీ దొరకలేదు. మామూలుగా ముందుకు అడుగువేసిన కాళ్లకు మెట్లు వుండటంవల్ల నేల తగలక తూలి. దబ్బున ముందుకు పడిపోయింది.

బాబిగాడు బయటకు వెళ్లిపోతే వాణ్ణి వెతుకుతూ తలుపులైనా వేయకుండా కంగారుగా బయటకు వెళ్లి, వాణ్ణి తీసుకుని అప్పుడే లోపలకు అడుగు పెడ్తూన్న మాధవి పడిపోతూన్న వసంతను చూసి పరిగెత్తుకు వచ్చింది, గట్టిగా కేక పెడ్తూ.



## 20

వసంత కళ్ళు మూసుకుని పడుకుని వుంది. ఆమె పక్కనే మాధవి కూర్చుంది. బాగా ఏడ్చినట్లుగా ఆమె కళ్ళు ఎర్రగా వుబ్బి వున్నాయి. వసంత తలదగ్గరగా కుర్చీలో శ్రీనాధ్ విచారంగా కూర్చుని వున్నాడు. లక్ష్మి వసంత కాళ్ళవైపు క్రింద కూర్చుని ఏడుస్తోంది.

వసంతకు అబార్షన్ అయింది! వరండా మెట్లమీంచి వున్నపాటున స్పృహతప్పి పడిపోవటంలో ఈ ప్రమాదం జరిగింది. దానికి తోడు మానసికంగా బాగా షాక్ అయింది. అదృష్టవశాత్తూ శ్రీనాధ్ వూళ్ళోనే వుండటంతో గండం గడిచిపోయింది. వసంతకింకా స్పృహ రాలేదు. తెలిసిన వాళ్ళూ, పేషంట్లూ, నర్సింగ్ హోం కడ్తూన్న కూలీలు, మేస్త్రీలూ అందరూ డాక్టర్‌గారి భార్యను చూసిపోతున్నారు, నిశ్శబ్దంగా.

ఇంతలో బూట్లు టకటక లాడించుకుంటూ గదిలోకి ఒక యువకుడు అడుగు పెట్టాడు. అప్పుడు మాధవి తలుపుకేసి వీపుచేసి కూర్చుని వుంది. ఆ యువకుడు శ్రీనాధ్ దగ్గరగా వచ్చాడు "వాట్ హాపెండ్ డాక్టర్?!" అని కంగారుగా అంటూ. ఆ

# ఇంటికి ఒక ప్రెస్టీజ్‌ని తీసుకువెళ్ళండి

# Prestige

## —దాని ధరలో ¼ ధరకే



లక్ష్మీవిలాస్ బ్యాంక్ లిమిటెడ్ మిగిలిన మొత్తం
8 నెలల కాలంలో 6 వాయిదాలలో చెల్లించడానికి
మీకు సహాయం చేస్తుంది.

LVB

**60%** పైగా ఇంధనం పొదుపు చేస్తుంది కనక మీ ప్రెస్టీజ్ దరిదాపు వాయిదాలన్నీ చెల్లిస్తుంది.

తమిళనాడు, పాండిచేరి, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక మరియు కేరళలలో లక్ష్మీవిలాస్ బాంక్ లిమిటెడ్ బ్రాంచిలు వున్నచోట్ల ప్రస్తుతం వర్తిస్తుంది.

పూర్తి వివరాలకి మీ ప్రెస్టీజ్ డీలర్ వద్దకు ఇప్పుడే వెళ్ళండి.

ప్రెస్టీజ్‌తో కదలండి — ప్రెషర్ కుకింగ్‌లో అగ్రస్థానంలో వున్నది.

టి.టి. (ప్రైవేట్) లిమిటెడ్, బెంగుళూర్ 560 016

కొనండి Prestige జీవితం సుఖమయం చేసుకోండి

SAA/TTP/2631/TEL

## శాంతి తీరం

స్వరం చెవిని పడగానే దిగ్గున లేచి బయటకు పరిగెత్తింది మాధవి. ఆమె అంత సడన్‌గా లేవడంవల్ల అనుకోకుండా ఆమెవేపే చూశాడా యువకుడు.

"మధూ !!!" ప్రపంచంలో లేని వింత చూస్తున్న ఆశ్చర్యం. అతని కళ్లలో, పిలుపులో వ్యక్తమైంది.

కానీ అప్పటికే మాధవి బయటకు పరుగు తీసింది.

ఆశ్చర్యంలోంచి తేరుకున్న యువకుడు పరిసరాలను మరచి మరో మాట ఆడకుండా ఆమె వెనకే తనూ పరిగెత్తాడు అక్కడున్న వాళ్లందరూ తెల్లబోయి చూస్తూండిపోయారు.

* * *

మాధవి వెనకే ఇంట్లోకి పరిగెత్తుకొచ్చిన ఆ యువకుడు గుమ్మం దగ్గరే టక్కున ఆగిపోయాడు.

"ఆగండి. వెళ్లిపొండి. నా దైవం ఇక్కడున్నాడు. మీరు వెళ్ళిపోండి" అల్మైరా దగ్గర అవతలికి తిరిగి నిలబడి అరిచింది మాధవి.

ఆనందం పట్టలేక ఒక్క ఉదుటున ముందుకు రావాలనుకున్న ఆ యువకుడు టక్కున ఆగిపోయాడు. అతని గుండెలో కోటి పిడుగులు పడినట్లయింది.

"నీ దైవమా !!! ఎవరు !?"

"ఇదిగో" భళ్ళున అల్మైరా తలుపులు తెరిచింది మాధవి.

అందులోకి ఆతృతగా చూసిన యువకుని హృదయం విరిసిన నందన వనమే అయింది. నల్లబడిన అతని ముఖాన్ని ఆనందం కారు చీకట్లో అకస్మాత్తుగా దీపం వెలిగించినంత కాంతి తెచ్చింది! పారవశ్యంతో అతని మేను పులకాంకితమైంది!

ఇటు తిరిగిన మాధవికి ఆహ్వానపూర్వకంగా చాచిన చేతులు కనిపించాయి. కాదు, కూడదనుకున్నా అటువేపే సాగకుండా ఆగలేకపోయిందామె. కానీ చాచిన చేతుల్లో వాకుండా అతని పాదాల మీదికి పూలపొట్లం తెగి పడినట్లుగా జారిపోయింది. వంగి ఆమె భుజాలందుకోబోయిన అతను ఆమె స్వరం విని స్థాణువులా ఉండిపోయాడు.

"మీరు లేరనుకున్నాను మీ స్మృతి విహ్వలంలా, నా హృదయంలోని మీ ముందు దీపంలా రెపరెప లాడుతోంది మనసు. మొన్నటివరకూ మిమ్మల్ని దైవంలా పూజించాను. నా హృదయంలోని ఆ పవిత్ర భావాన్ని, ఆ ఆరాధనను అల్లాగే జీవింపనిస్తే ఎంత బాగుండేది! గమ్యం చేరబోతున్న నా పయనంలో అడ్డు దారిలా మళ్ళీ ఎందుకు కనిపించారు? రూపాన్ని మరచి జ్ఞాపకాలనూ, స్మృతులనూ మాత్రమే చూస్తున్న నా మనో నేత్రం ముందుకు చెదలుతున్న చిత్రపటంలా మళ్ళీ ఎందుకు వచ్చారు? మీరు నావారే అనుకున్న ఆ అబద్ధంలో. ఆ మూఢ నమ్మకంలోనైనా నేను శాంతిగా జీవించేదాన్ని. ఈనాడు నిజం నిప్పులా నన్ను కాలుస్తోంది. నరేన్. నరేన్"

నరేంద్రకు ఆమె మాటలు పూర్తిగా అర్థం కాకపోయినా అతని మనస్సన్ని

ధర్మపథం

# పురాణ లక్షణం

— బులుసు వేంకటరమణయ్య

సాధారణంగా పురాణ కాలక్షేపాలు రాత్రిపూట జరుగుతూ ఉంటాయి. దానిని వినడానికి పిన్నలు, పెద్దలు అంతా ఒకచోట చేరుతారు. పురాణాలలో గొప్పవి, కాలక్షేపాలకు తగినవి, భారత, భాగవత, రామాయణములని అనుకుంటున్నాము. వాటి కలా పేరు వచ్చినా మూడూ పురాణాలనుకోవడం కుదరదు. వాటిలో భాగవతం ఒక్కటే పురాణం. రామాయణం ఆది కావ్యం. భారతం ఇతిహాసం. కాబట్టి ఆ రెండూ పురాణాలలో చేరవు. పురాణలక్షణం వాటికి కుదరదు. ఆ లక్షణం—

శ్లో. 'సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వం తరాణి చ,
వంశాను చరితం చేరి పురాణం పంచలక్షణమ్'.

సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరము; వంశాను చరితం అనే అయిదున్నూ కలది పురాణం కాగలదని దీని అభిప్రాయం.

సర్గమంటే కల్పం యొక్క ఆరంభదశ. అంతే కాని సృష్టి కాదు. సృష్టికి ప్రారంభమనేది లేదు. పంచ భూతాలు లయం పొందిన పిమ్మట తిరిగి కల్పం ఆరంభ మవుతుంది. ఆ కల్పారంభదశనే సర్గమని చెప్పవలసి ఉన్నది.

ప్రతి సర్గం— భగవంతుడు బ్రహ్మదేవుణ్ణి సృష్టి కార్యానికి ఏర్పరచాడు. అతడు ప్రజాపతులను జనింప జేశాడు. ఆ బ్రహ్మయు, ప్రజాపతులును చేసిన సృష్టి క్రమాన్ని వివరించే పద్ధతి.

వంశమంటే దేవదానవ గంధర్వాదుల సృష్టి వివరాలను, ఋషి గణాలయొక్క ఉత్పత్తి క్రమాన్ని వర్ణించడం.

మన్వంతరంలో పధ్నాలుగురు మనువులయొక్క ఉత్పత్తి, వారి పరిపాలన కాలం, మున్నగువాటి వర్ణనం ఉంటుంది.

వంశాను చరితం మానవులకు సంబంధించినది. ఇందులో సూర్య వంశంలోను, చంద్ర వంశంలోను పుట్టిన రాజుల చరిత్ర వివరంగా ఉండవలెను. ధర్మాలను బోధించే గాథలున్నూ ఉండును. ధర్మాత్ముల వృద్ధి పొందుట, దుష్టులైన రాజులు నశించుట వివరింపబడును.

'పురాణం పంచలక్షణం' అని అందరూ అంటారు. ఆ అయిదు లక్షణాల పేర్లు కొందరికి మాత్రం తెలుసును. ఆ సర్గాదులలో వివరింపబడే విషయాలు అందరికీ తెలియవు. అందువల్లనే వీటిని తెలుసుకొనడం మంచిది.

పయి విషయాలన్నీ భాగవతంలోనే కానవస్తాయి. అందువల్లనే అది పురాణంగా లెక్కలోకి వస్తున్నది. 

వికాకు పరిచాయి; మనసును చీల్చాయి. ఒకరి కొకరు లేరని ఇద్దరూ భ్రమలో ఇంత కాలం గడిపి. ఇన్నేళ్ళతర్వాత అకస్మాత్తుగా కలుసుకున్న ఈ ప్రథమ క్షణాలలో, ఈ అమృత క్షణాలలో మాధవి కళ్లలో ఆస హనం! మాటల్లో అంతులేని అయిష్టత, నిష్ఠురత! అతని గుండె గాయమైంది!

ఆవేశంతో నరాలు పొంగాయి. పళ్లు గిట్టకరుచుకున్న సూచనగా గవదల మీది కండరాలు కదిలాయి. మాధవి జబ్బలు చిదికిపోతాయేమో నన్నంత బలంగా గుచ్చి పట్టుకుని, చటుక్కున లేవదీశాడు.

"ఆగు. మరేమీ మాట్లాడకు. నేను చచ్చిపోయానని తెలిసి నీకు మతి పోయిన ట్లుంది. లేక చచ్చిపోయాననుకున్న నేను బ్రతికి రావడం చూసి కొత్తగా మతి చలించిందేమో మరి. రా, నిన్ను పిచ్చాసుపత్రిలో చేరుస్తాను."

రోషంతో బుసలు కొట్టింది మాధవి.

"చేరుస్తారు. ఎందుకు చేర్చరు? చచ్చాననుకున్న నేను బ్రతికి వుండటం చూశాక పిచ్చాసుపత్రిలోనే కాదు సముద్రపు అట్ట

## శాంతి తీరం

డుక్కు కూడా చేరుస్తారు. లేకపోతే మీ రాణివాసపు భార్య వూర్కోదుగా."

"భార్యా! రాణీవాసపు భార్యా!" ఒక్క క్షణం ఆశ్చర్యంతో నోరు తెరచి వెంటనే ఫక్కున నవ్వాడు.

"నిన్ను తీసుకువెళ్లి అతఃపురంలో వుంచుతానని చెప్పి మాయమై పోయాననా నీ అలుక? కానీ మధూ, మాయమైపోయిం దెవరు? నేను వున్నచోటనే వుండిపోయాను. నీవే మాయమై అయిపులేకుండా పోయావు. నాకు అంతులేని శిక్ష విధించావు. ఇప్పుడు దేవతలా ప్రత్యక్షమై కూడా..."

ఆశ్చర్యంగా కళ్లెత్తి నరేన్ కళ్లల్లోకి చూస్తూ, "అయితే... అయితే మీభార్య!"

"నా భార్య నీవే... కోటి జన్మల వరకూ" చిరునవ్వుతో అన్నాడు నరేన్.

ఆ మాటతో మాధవి కళ్ళు కలువల్లా విచ్చుకున్నాయి, అతని చిరునవ్వనే చంద మామను చూసి పులకించినట్లుగా.

"నిజం!" అంటూ అతన్ని అల్లుకు పోయింది మాధవి.

"మధూ, నా మధూ" అప్పటివరకూ ఇగిరిపోయిన అమృత కలశంలాంటి మాధవి ముఖాన్ని ముద్దులనే మధువుతో నింపి వేశాడు నరేన్.

ఆమె కళ్లలోకీ, ముఖంలోకీ, పెదిమల లోకీ కొత్త వెలుగు వచ్చింది. అణువణువునా ఆనందపు ఝరి ప్రవహించి నవచైతన్యంతో చంచలించి పోయింది. ఆ పులకింతలను ఒక్కతీ భరించ లేనట్లుగా నరేన్‌లోకి లీన మైనంత గాఢంగా హత్తుకుపోయింది. ఎంత పెదిమలు బిగించినా అంతట ఆనం దాన్ని ఆపుకునే శక్తి లేనట్లుగా పెదిమలు విడివడుతుండగా పకపక నవ్వసాగింది. పన్నీటి బుడ్లలోంచి పన్నీటి జల్లులు రాలినట్లుగా మాధవి కళ్లలోంచి ఆనంద భాష్పాలు రాలసాగినై.

తన కౌగిలిలోని ఆ ఆనంద మోహినిని, ఆ ప్రేమ మూర్తిని పరవశుడై చూస్తూండిపోయాడు నరేన్.

(ఇంకా వుంది)

# పెన్షను

ఎ ఎస్ జగన్నాథ శర్మ



**వేసవి కాలం.**

**బయట ఎండ చితగ్గొట్టిన గాజుపొడి రాళ్ళున్నట్టు తీక్షణంగా వుంది. పిట్ట మనిషి అలికిడి లేదు జనం అంతా మిద్దెల్లోను, మేడల్లోనూ మగ్గిపోతున్నారు. అయితే —**

ఆ ఊరికి ఉత్తరానున్న ఆ ఎత్తు అరుగుల మేడ ఇంట్లోని కుటుంబాలు మాత్రం అంత ఉక్కలోను, ఆ మధ్యాహ్నం పూట నిక్షేపంగా కాలక్షేపం చేస్తున్నాయి. వాళ్ళల్లో వాళ్ళు – కథలు, కబుర్లూ చెప్పుకుంటున్నారు. ఒకొర్నొకరు పరామర్శించుకుంటున్నారు. వేధించుకుంటున్నారు.

"ఏమండీ మూర్తిగారూ! ఎప్పుడొచ్చారు? మీ పెద్దబ్బాయి, పిల్లలూ కులాసాయేనా! కారంపూడి విశేషాలు మరి చెప్పారుకాదు" అంటూ బర్కిలీ సిగరెట్టును చాలా ఠీమాగా కాలుస్తూ అడిగాడు ఇంటి ఓనరు – ఇల్లరికపు అల్లుడు.

సమాధానంగా నవ్వేస్తూ చిడీమీద మడత కుర్చీని వాల్చుక్కూర్చున్నాడు మూర్తి.

"అటుస్తైడు వాళ్ళేనట మన సినీస్టార్స్ అందరూను. ఎంతవరకూ నిజం" ఉత్సాహంగాను, కుతూహలంగానూ మాట్లాడుతున్నాడు ఉబ్బరసొమ్ముని భోంచేస్తూన్న పెద్ద మనిషి.

"ఆఁ! ఆఁ" అనగలిగాడు మూర్తి.

"అక్కడ కోతులెక్కువట."

"అవును" అంటూ దగ్గాడు

"ఇంతకీ మీరెళ్ళిన పని పండా, కాయా?!" సంశయాన్ని ప్రకటించాడు వోనరు బాబు.

జవాబు ఇయ్యడానికి నచ్చలేదు మూర్తి. "అవునే" అంటూ ఇంట్లోని భార్యని కేకేశాడు.

ఆవిడ రాత్రి ఫలహారానికి బియ్యపు మొరుం విసురుకుంటోంది. జ్ఞాపకానికి వున్నంతమట్టుకు 'దక్షయజ్ఞం' పాటగా వల్లె వేసుకుంటోంది, తిరగలి శబ్దం గొంతుకి లయకడ్తుంటే తన్మయత్వం చెందుతోంది.

ఇంతలో ఇతగాడి కేక విన్పించి –

"వచ్చే–వచ్చే' అని పల్కింది. వచ్చి గుమ్మందగ్గర నిలబడింది.

"అమ్మాయి వేగంగా అఫీసునుంచొచ్చి ఏదో ఇంగ్లీషు సినిమాకి వెళ్తానంది! ఇంకా రాలేదేఁ!" అడిగాడు మూర్తి వస్తూన్న దగ్గు పొరను అణుచుకుంటూ.

"రాలేదండి. అదే ఆలోచిస్తున్నాను. టిఫిన్ బాక్సుకూడ పట్టుకు వెళ్ళలేదు."

"ఏ ఫిల్ముకి" టక్కున అందుకున్నాడు అల్లుడు దిగ్రేట్...

వినుక్కుంటున్నాడు మూర్తి అతని చేష్టలకి – మాటలకీ. ఆ విషయాన్ని ముఖంలో ప్రస్ఫుటమయ్యేలా కనబర్చాడు. దాన్ని షంటింగ్ మాష్టర్ గ్రహించి గదిలోనికి చక్కాబోయి ఫేన్ స్విచ్ ఆన్చేసి కరెంటు లేదని తెలుసుకుని బాధపడుతూ క్రిందనే సిమెంటు గచ్చుమీద వెళ్ళకిలా పడుకున్నాడు.

మూర్తి ఇబ్బందిగా మడత కుర్చీలో కదిలాడు.

"విషయారేమిటో చెప్పనే లేదసలు, రాత్రనగా వచ్చి బొమ్మలా పులకరూ పలకరు!" ఆసక్తిగా, అతన్ని గిచ్చినట్టుగా అడిగిందావిడ.

"ఏముంటాయి! అబ్బాయీ కోడలు పిల్ల, పిల్లలూ కులాసాగా వున్నారు. పూర్వంలా కాకుండా ఇప్పుడు పెద్ద ఇల్లు అద్దెకు తీసుకున్నాడు. కరెంటు – బాత్రూం – కుళాయీ ఇల్లు ఇంద్ర భవనంలా వుంది. మునుపటికన్నా ఎక్కువ

గానే రెండు చేతులా ఆర్జించుకుంటున్నాడు. తింటున్నాడు పడుకుంటున్నాడు. ఇంకేం వుంటాయి.'' భార్య ముఖంలోనికి చూశాడతను.

''అది కాదండి! మనబ్బాయి గురించి కాదు పెళ్ళికొడుకు గురించి. ఎలా వుంటాడు ఏమిటసలు ''

'చెప్పానుగా రాత్రే! అందంగా వుంటాడు. మంచి కులం-ఆస్తి-ఉద్యోగం వున్నవాడు. పోతే చెడు సావాసాలు, చెడు అలవాట్లూ మితిమీరి కలవాడు. అమ్మాయిని కట్టబెడితే ఏ కోశాన్నా సుఖపడలేదు. అందుకనే ఆ సంబంధాన్ని కాదనీ వొచ్చేశాను ''

'వ్ప్' విచారాన్ని వ్యక్తపరిచిందావిడ.

''అదీ సంగతి! వెళ్లి నీ పన్చూసుకో'' అని శూన్యంలోనికి చూస్తూ పడుకున్నాడు మూర్తి.

మూర్తి ఒకప్పుడు బలంగా - బొంగరంలా తిరిగిన మనిషే డబ్బారేకులా తెగ వాగేవాడు అప్పట్లో -

అప్పట్లో అతనికి పద్దెనిమిదేళ్లు. ఆ వయసుకి తగ్గట్టు నిండుగా, బలిష్ఠంగా వుండేవాడు. తల్లీ తండ్రీ లేక మేనమామ పంచన చేరి - కొన్నాళ్ళు అక్కడ - మరి కొన్నాళ్ళు వారాలు చెప్పుకుని తిని చదువుకునేవాడు. తెలివైనవాడని అతన్నందరూ అభినందించేవారు. తగిన సహాయం కూడ చేసేవారు. ఆ సహాయం కోరి,వాళ్లముందు లౌక్యంగా ఇందాకటి ఇల్లరికపు అల్లుడికి మల్లే తెగ మాట్లాడేవాడు. తెలిసిన వార్తల్ని, తెలుసుకుంటోన్న వూహల్నీ గమ్మత్తుగా జోడించి మాట్లాడి అవతల వారిని శ్రోతల్ని చేసుకునేవాడు. ఇంకా వాళ్ళు అవకాశమిస్తే బాధల్నీ, గాధల్నీ వెళ్లబోసుకునేవాడు.

— అది ఆనాడు అతనికి పనికివచ్చింది. ప్రవర్తనగా అలవర్చుకున్నాడు. అలా ఏకధాటీగా ఆతగాడు మాట్లాడినందుగ్గాను అందరూ అతన్ని 'మంచి ఉపన్యాసకుడు' అని మెచ్చుకున్నారు. సన్మానించారు.

మెప్పులూ, సన్మానాలూ అతనొక్కడూ పొందడం వాళ్ల మామయ్య చూసి ఓర్వలేక కూతుర్ని అంటగట్టాడు. జతగా వేరుండి సుఖపడమన్నాడు. ఆ విధంగా చేతులు దులుపుకుని మూర్తిని అతను తరిమి కొట్టాడు.

'సరే'నని జీవితం పరుగుపందెంలో తన కంటూ ఓ పరిధిని గీసుకుని— దాన్ని వ్యక్తిత్వంగా మలుచుకుని ఇద్దరు పిల్లలకుతండ్రి అయ్యాడు మూర్తి. రెక్కలు ముక్కలు చేసుకుని ఇద్దర్నీ పెంచుకొచ్చాడు. పెద్దవాడు రామానికి పెళ్లి చేశాడు. వాడిప్పుడు కారంపూడిలో విజిలెన్సు ఇనస్పెక్టరుగా వుంటున్నాడు. వాడికిప్పుడు నలుగురు పిల్లలు,

రెండవది తులసి. ఎస్. ఎస్. ఎల్. సి. పాసై టైపు, షార్టుహేండూ నేర్చుకుని వూర్లోనే వున్న ఒక ప్రైవేటు కంపెనీలో స్టెనోగా వర్కు చేస్తోంది. దానికే ఇప్పుడు వాళ్ళూర్లో పెళ్లి సంబంధం వుందని రామం ఉత్తరం రాస్తే రెక్కలు గట్టుకుని వెళ్లి వాలాడు మూర్తి.

అట్నుంచి తిరిగొచ్చాడు.

''మూర్తి గారూ! పల్నాటియుద్ధం కారంపూడి పరిసర ప్రాంతాల్లోనే జరిగింది కాబోలు!'' చేతి ట్రాన్సిస్టరులో సిలోన్ పెట్టుకుని పాటలు వింటూ అడుగుతున్నాడు షంటింగ్ మాస్టర్.

''ఊఁ'' అన్నాడు మూర్తి అన్యమనస్కంగా.

అతనికి మొన్నట్నుంచీ జరిగిన సంఘటనలు ఒక్కొక్కటే జ్ఞాపకానికి వస్తున్నాయి. జ్ఞాపకాలు సినిమారీళ్ళలా కదులుతున్నాయి.

గతంలోనికి జారిపోయాడు మూర్తి.

* * *

గడపలో నవారు మంచం వేసి, తలగడా పడేసి పడుకోమంది కోడలుపిల్ల మూర్తిని.

ప్రయాణాలవల్ల అలసటగా వుండీ, శరీరం నిద్రను కోరుతున్నా— అబ్బాయి రామంతో అన్ని విషయాలూ మాట్లాడాలని మెలుకువగానే వున్నాడు మూర్తి. పిల్లలందరూ అతని చుట్టూ చేరి 'తాతయ్యా —

# పెరుగు అట్లు

డి. గీతాకుమారి

కావలసిన వస్తువులు : బియ్యం 4 పావుశేర్లు, పెరుగు 1 పావుశేరు, నీళ్ళు 4 పావుశేర్లు, అల్లం చిన్నముక్క, పచ్చిమిర్చి 100 గ్రా. ఉల్లిపాయలు పెద్దసైజువి 4, జీలకర్ర టీ స్పూను, ఉప్పు తగినంత.

ఇవి రేపు తయారు చేస్తామనగా ఈ రోజున బియ్యం నానబెట్టకోవలెను. నానిన బియ్యాన్ని బాగా నీళ్లు వంచేసి, రోట్లోవేసి మెత్తగా పిండి దంచుకోవలెను. అంతే పిండి దంచెయ్యకూడదు. బియ్యం మొదటి సారి దంచేక ఒక పావుశేరు మొరియములు (నూక) వేరే తీసివేసి తరువాత అంతా దంచెయ్యవలెను. దంచిన పిండిని వేరే అట్టేపెట్టుకోవలెను యిప్పుడు (బియ్యం దేనితో కొలతకు తీసుకున్నారో దానితో) 4 పావుశేర్లు నీళ్ళు పొయ్యిమీద పెట్టవలెను. నీళ్ళు బాగా మరిగేక నూకరవ్వ వేసి ఉండ కట్టకుండా కలయబెట్టి బాగా ఉడకబెట్టవలెను. గట్టిపడకుండా పలచగా వచ్చినా భయపడనక్కర్లేదు. యిప్పుడు ఈ ఉడకబెట్టిన దానిని క్రిందకు దించేసి, ముందుగా సిద్ధం చేసుకున్న పిండినీ, పావుశేరు పెరుగునూ, ఉడకబెట్టిన దానిలో తగినంత ఉప్పు వేసి ఈ మూడూ బాగా ఉండలు లేకుండా కలిపి మూత పెట్టుకోవలెను. ముందురోజు ఈ ముద్ద గట్టిగా ఉంటుంది. ఒక్క చుక్క కూడా నీళ్ళు పొయ్యరాదు ఇది మర్నాటికి బాగుగా నాని, అట్లపిండి మాదిరిగా వస్తుంది. ఉడికినదీ, వాసన వేస్తుంది అని భయపడక్కర్లేదు.

మర్నాడు ఈ ముద్దలో ఉల్లిపాయలూ, పచ్చిమిరపకాయలు, అల్లంముక్కా,జీలకర్ర, సన్నగా తరుక్కొని పిండిలో కలపవలెను. తరువాత పొయ్యిమీద అట్లపెనం పెట్టి ఒక్కొక్క గరిటెడు చొప్పున ముద్ద వేసి (పెద్దవి వస్తుంది కదా అని నెరిపెయ్యకూడదు) చుట్టూ నూనె వేసి, బేసిని గానీ, కంచంగానీ, మూతపెట్టవలెను. 5 నిముషాల అనంతరం మూత తీసి చూస్తే రొట్టెలా పొంగిఉంటుంది. దీనినితిరగపెట్టి మళ్లీమూతపెట్టి రెండునిముషాల తరువాత చూస్తే ఎర్రగా కాలి ఉంటుంది. దీనిని తీసి కంచంలో పెట్టుకొని యిలాగే అన్నీ చేసుకుని తింటే ఎంతో రుచిగా ఉంటాయి. వేడి మీద తింటే ఎంతో రుచిగా ఉంటాయి.






తాతయ్య' అంటూ అల్లరి చేస్తున్నారు. వాళ్లని ఆడిస్తూ, సముదాయిస్తూ బుజ్జగిస్తూ నవ్వుతున్నాడు మూర్తి.

నవ్వి నవ్వి దగ్గాడు. ఎడతెరపి లేకుండా దగ్గుతూనే వున్నాడు. దగ్గుతో చుట్టుకు పోతున్నాడు.

కోడలు పిల్ల ఆత్రంగా వచ్చి దగ్గరున్న పిల్లల్ని దూరంగా తరిమేసింది. ఏడుస్తుంటే వాళ్ళని నాలుగు చరిచింది కూడ.

కొంతసేపటికి దానంతటదే నిమ్మళించుకున్నాక కొద్దిగా నీళ్ళు తాగి అన్నాడు మూర్తి కోడలు పిల్లతో.

"ఒకప్పుడు కబుర్లు చెప్పేకు బ్రతికాను. ఆ కబుర్లే ఇంకా గట్టిగా చెప్తే ప్రైజులు పొందాను. తర్వాత అటువంటి కబుర్లే బడి పిల్లలకు చెప్పేకుని వృత్తి చేసుకున్నాను. అదలా అలవాటయ్యింది. పిల్లల్ని చూస్తే ధాటీగా మాట్లాడాలని వుంటుంది. బుద్ధెక్కడికి పోతోంది. చెప్పేనోరు—తిరిగే కాలూ వుండబట్టేవు మరి. ఇంకా ఈ వయసులో ఇప్పుడు కూడ బలవంతుణ్ణని అనుకునే తెగ మాట్లాడుతూ నవ్వుతూంటాను. వెధవ దగ్గు ముంచుకొస్తుంది తప్ప 'నే న్నున్నానోచ్' అంటూ — లేకపోతేనా ..."

వూళ్ళో కలరా వుందని అక్కడెక్కడో ఇల్లులుకి మందు 'స్ప్రే' చేయించి వచ్చాడు రామం. వస్తూనే అడిగాడు, చెల్లెలి పెళ్లి సంబంధం గూర్చి.

"సంబంధం బాగానే వుంది. అయిదు వేలరూపాయలు కట్నంగా తెమ్మంటోంది." అన్నాడు మూర్తి.

## పక్షులు

"దాన్కేం వుంది. అది మామూలే! కాని, ఒకటి—ఇంతకన్నా మరి మీకు మంచి సంబంధం దొరకదు."

"నిజమే అనుకో. కాని..."

"కాని ఏమిటన్నా! ఎక్కడో అయిదు వేలు అప్పు పుట్టించి ఆ పెళ్లి కాస్తా చేసేలేవు" తేలిగ్గా మాట్లాడాడు రామం.

ఆ రకం మాటలికి మూర్తి కొద్దిగా చలించాడు. కాస్సేపటికి నవ్వి—

"అప్పుకేం! ఇంతకు ముందిచ్చిన వాళ్ళు ఇప్పుడు మనకివ్వరు. పోనీ ఇప్పుడియ్యబోయే వాళ్ళు ఇంతకు ముందు మన సంగతి తెలుసుకుని అసలివ్వరు"

"అంటే" అదోలా మొగం పెట్టి అడిగాడు రామం.

"అప్పుడు తాతయ్య చావు— అమ్మ జబ్బు — తులసి చదువూ అన్నీ ఒక్కసారే ముంచుకొచ్చాయి కదా! అప్పట్లో వాటి కోసం చేసిన అప్పులన్నీ మొన్న నేను రిటయిరయ్యేన తరువాతకదా తీర్చింది. ఇంతకాలం అప్పుల్ని ఎగమెడ్తే మళ్లీ ఎవ్వడా అప్పులిచ్చేది."

"మరి పెళ్ళెలా జరుగుతుంది"

"దానికే నీ సహాయం కావాలి. సంబంధాన్ని చూసిపెట్టావ్. పెళ్ళికూడ చేసి పెట్టు."

"దాన్కేంవుంది లెండి. పెళ్ళిళ్ళూ — శోభనాలూ మేం చేసుక్కూర్చుంటే మా పని ధ్వంసథూళి. పిల్లల పెంపకాలకి — చదువులకీ ఎంతవుతుందో మీరాలోచించనే లేదు" కల్పించుకు వచ్చింది కోడలుపిల్ల.

ఆమె చేసిన సంభాషణకి పౌరుషం ముంచుకురాలేదు మూర్తికి. కోపంకూడ కలగలేదు. కొందరి లక్షణాలు అంతేనని సర్దిబుచ్చుకున్నాడు. సమాధానం కోసం కొడుకువైపు చూశాడు. రామం భార్య మాటలకు తలొగ్గినట్టుగా బుర్ర దించు కూర్చున్నాడు.

"మాట్లాడవేరా" ప్రశ్నించాడు మూర్తి.

పిల్లలు అల్లరి చేస్తుంటే పట్టుకొని వచ్చి, కూర్చోబెట్టి పుస్తకాల్ని చదువుకోమంది కోడలు. తల్లిదగ్గర భయంకొద్దీ వాళ్ళు చదువుకుంటున్నారు.

"అతనేం మాట్లాడుతారు. మాకూ పిల్లాజెల్లా వున్నారు వాళ్ళకీ పెళ్లిళ్ళూ — చదువులూ చెప్పించాలా! అప్పుల్చేసుకుని బ్రతికితే రాబోయే కాలంలో పిల్లల గతేం గాను. ఒకప్పట్లా మీ అబ్బాయికి ఇప్పుడేమీ పైన దొరకటంలేదు. నెలకి ఆ నాలు గొందల కరకులే! మాట్లాడరేంవండీ!" రామాన్ని కుదిపిందామె.

"అవునవును."

"పోనీ, మెళ్ళో గొలుసు — నెక్లసూ అమ్మి ఆడపడుచు పెళ్ళి చేద్దామంటే ఆ అదృష్టం నాకు దక్కలేదు. అవన్నీ మీ జబ్బులికి, తద్దినాలకీ అమ్ముడుపోయాయి కదా!"

"ఏంవుందని మా దగ్గర అతన్నలా అడుగుతున్నారు. అస్సలు మీరేం చేశారని మాకు మేం డబ్బు ఇవ్వడానికి. ఏదో వేరుంటానని అల్లరి చేసినందుకు కట్టుబట్టలోతో మమ్మల్ని నూటపాతిక రూపాయలు వుద్యోగం చేస్తూన్న ఈతని దగ్గరికి తోలేశారు. అప్పట్లో ఏం తిన్నామో! ఎలా బ్రతికామో మాకే తెలీదు. అదృష్టం కలిసొచ్చింది. పరీక్షలకు పరీక్షలు కట్టుకుని ఇన్నాళ్ళకీ స్థితికివచ్చాం. నా నగలన్నీ వొలిచేసి, నన్ను బాదపెడ్తే — నేనేదు స్తే మీ అయన దగ్గరయినోయి వేరుండమన్న వాళ్ళేకదా మీరు! ఇప్పుడె ముఖంతో అడుగుతున్నారు డబ్బు. మనిషికి ఆలోచనా జ్ఞానం కొంత వుండాలి. ఓడలు బళ్ళూ, బళ్ళు ఓడలూ అవుతాయన్నది గుర్తుంచుకుంటే సరి" ఎప్పుడెప్పుడో అక్కసు అంతా మామగారిమీద ఒక్కసారిగా తీర్చుకుంది కోడలు. మూర్తి అంతా వింటున్నాడు. రామం కద



# మనోజ్ఞమైన రూపకల్పన

నీలి, ఆకుపచ్చ, గ్రే, నలుపు, బ్రౌన్ మరియు బెయిజ్ రంగులు ఎవరూ, ఎప్పుడూ, ఎక్కడా సమర్పించని విస్తృత శ్రేణిలో!

కాటన్ బట్టలలో పాప్లిన్స్, కేంబ్రిక్స్, సాటిన్స్, డ్రిల్స్, గేబర్డిన్స్...ఇంకా పోలియెస్టర్ మిశ్రిత సూటింగులు మరియు షర్టింగులు.



# మదురా బట్టలు

తయారుచేయువారు :

# మదురా కోట్స్

డీలర్లు :

మదురా సౌత్ ఇండియా కార్పొరేషన్. (ప్రై.) లిమిటెడ్.156, వస్త్రలత, విజయవాడ 520 001. మదురా సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రై.) లిమిటెడ్. 3-4-191, ఒబ్బారి బిల్డింగ్, 1వ ఫ్లోర్, హోల్‌సేల్ క్లాత్ మార్కెట్, సికింద్రాబాద్ 500 003. శ్రీ లక్ష్మీ టెక్స్‌టైల్స్, బెసెంట్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ 520 002.

## ప క్షు లు

లికలను పరిశీలిస్తున్నాడు. వాడేమంటాడోఅని చూస్తున్నాడు.

'అవున్నాన్నా! నిజమే' అన్నట్టున్నాయి వాడి కళ్ళు. రామం లేచి లోనికి వెళ్ళిపోయాడు.

"...స్వాసబలిమికాని తనబలిమికాదయా! విశ్వాభిరామ వినురవేమ!" మను మరాలు పద్యం చదువుతోంది. మూకుమ్మడిగా మూర్తి కొడుకు ప్రవర్తన తలచుకుని పద్యానికి వాటిని అన్వయించుకుని కసితీరా నవ్వుకున్నాడు. నిండుగా నవ్వుకున్నాడు. తర్వాత అంతకన్నా నిండుగా దగ్గుకున్నాడు.

'మరెందుకు కయితే ఈ ముచ్చటకేనా నన్ను పిల్చింది' అని కొడుకుని దులిపేద్దాం అనుకుని— కాస్సేపటికి ఆలోచించి మానుకుని, ఆశ నిరాశను చేసుకుని తిరుగు ప్రయాణం కట్టాడు మూర్తి.

కోడలుచేసిన హంగామాకి అతనేం కించపడలేదు. ఆమె ప్రవర్తన నిజమేనేమో! అన్పించింది. ఆ పసి హృదయం మీద అలనాటి సంఘటనలు అంతలా గట్టి ముద్ర పడ్డాయా! అని విచారించాడు.

అంతే!

తర్వాత—

రైల్లో కూర్చుని తులసికి పెళ్ళి చెయ్యకపోతే వచ్చే నష్టం ఏమిటని ఆలోచించాడు. అతనికి ఆ విషయంలో తాత్కాలికంగా నష్టాలేమీ కన్పించలేదు. పోతే లాభాలు ఎక్కువగా కన్పించాయి.

తులసి ఇప్పుడు మూడొందల రూపాయలు పే చేస్తున్నాది. ఆ డబ్బుతోను, అతనికి వస్తూన్న పెన్షను డబ్బుతోనూ అతగాడి కుటుంబం సజావుగా సాగుతోంది. కట్టుకుందికి సరియైన గుడ్డ— తినడానికి తిండి— వుండడానికి ఇల్లు— కాపురం ఒకరు వేలెత్తి చూపించకుండా పోతుంది.

ఇటువంటప్పుడు—

తులసికి పెళ్ళిచేసి ఒక ఇంటి దాన్ని చేస్తేనో!?

నష్టాలు మిక్కుటంగా కన్పించాయి మూర్తికి.

అప్పుడు—

తులసి అతన్దికాదు, తులసి డబ్బు అతన్ది కాదు.

### అ॥ అ॥ కొ॥

లండన్ నుంచి తిరిగి వస్తూన్న కేంద్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీ రాజ్‌నారాయణ్‌కి న్యూయార్కు నుంచి బొంబాయి వస్తున్న విమానంలో కువైత్ విమానాశ్రయంలో ఆ విమానం ఎక్కిన తరువాత, అది బయలుదేరుటకు సిద్ధంగా వున్న సమయంలో "డ్యూటీ ఫ్రీ దుకాణం" నుంచి ఒక ట్రాన్సిస్టర్ రేడియో కొనుక్కోవాలన్న విషయం గుర్తుకు వచ్చింది. తన అసిస్టెంట్ ని విమానం దిగివెళ్ళి మూడు బ్యాండ్ల రేడియో ఒకటి కొనితెమ్మని పంపించారు. దీంతో 350 మంది ప్రయాణీకులు వున్న ఎయిర్ యిండియా జంబో 116 జట్ విమానం 25 నిమిషములు ఆలశ్యం అయ్యింది. విమాన చోదకుడు "ట్రాఫిక్" కారణాలవలన ఆలస్యమైనదని తన లాగ్ పుస్తకంలో పేర్కొన్నాడు. కువయట్‌లోని వైమానిక అధికారులు [వి. ఐ. పి – వెరీ యింపార్టెంట్ పర్చేజ్?] "అత్యంత అవసరమైన కొనుగోలు!" అని రిపోర్టులో రాసుకున్నారు —

తర్వాత—

అతని సుఖం — తృప్తి పటాపంచలై ఎగిరిపోతాయి. ఈ పండిపోతున్న వయసులో చాలీ చాలని తిండితో అతను కృశించి నశించి పోతాడు. అది అతను భరించలేడు.

అందుకనే...అందుకనే... !!!

ఒక పచ్చి అబద్ధం!

ఒక పిచ్చి ఆలోచన!

బాధ్యతగల తండ్రిగా ఓ దుష్ప్రవర్తన!

తులసికి పెళ్ళి చేయకూడదని నిశ్చయించుకున్నాడు. అందుకు తగ్గట్టుగా ఇంట్లో చెప్పాడు. పెళ్లికొడుకు గుణగణాలు బాగున్నా బాగాలేవని చిత్రీకరించాడు. అతణ్ణి చెడ్డవానిగా చేసి కూతురు ముందు, భార్య ముందు నిలబెట్టాడు. ధ్యేయాన్ని నెరవేర్చుకుంటున్నా ననుకున్నాడు.

తులసి కూడ సంబంధం తప్పిపోయి

(36వ పేజీ చూడండి)

# రైలుబండి ఎంచక్కా ఎక్కుదాం

పార్లే గ్లూకో ఎంచక్కా మెక్కుదాం

ప్రతి పాప నోట్లోనూ

## పార్లే గ్లూకో మజా రుచితో... ఎంతో శక్తితో




పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్‌లలోని శక్తినిచ్చే తత్వం గల పోషక పదార్థాలతో నిండి వున్నాయి పార్లే గ్లూకో బిస్కట్లు.




గ్లూకో—భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్



వరల్డ్ సెలక్షన్ బహుమతి విజేత

# రా గ

**యార్లగడ్డ**

మామగారు పోయినప్పుడు పార్వతిని పిలిపించాలని జానకి ఎన్నో ప్రయత్నాలు చేసింది ఎన్నివిధాలు చెప్పినా గోపాలం వినలేదు. చెల్లెలి పేరు ఎత్తితేనే రుసరుసలాడిపోతున్నాడు.

"పార్వతికి తిరిగి ఆ ఇంటి గుమ్మం యెక్కే అర్హతలేదు !" అన్నాడు కోపంగా గోపాలం

"ఎంతయినా ఆమె తండ్రికదా ?" అంది నచ్చచెప్పే విధాన

"అయితేమాత్రం ? చెప్పాపెట్టకుండా ఇల్లు విడిచి ఎవడితోనో లేచిపోయి మా పరువు మర్యాదలను సర్వనాశనం చేసింది ఎన్నడూ ఎవరితోనూ వేలుపెట్టి చూపించుకోని కుటుంబాన్ని నవ్వులపాలు చేసింది అలాంటి అయోగ్యురాలినా పిలిచేది ? ఛీ. ఛీ .!" అంటూ ఛీత్కరించుకుంటూ అక్కడ వుండకుండా వెళ్ళిపోయాడు జానకి యింకేమీ మాట్లాడలేకపోయింది భర్త పట్టుదల, కోపం ఎలాంటిదో జానక్కి తెలిసికూడా మౌనం వహించలేకపోయింది పార్వతికి తండ్రి చనిపోయాడని తెలిసి తనంతట తను వస్తేతప్ప ఆడబడుచుగా అన్నలు పిలవరన్నది రూఢి అయింది జానక్కి పరంధామయ్య కర్మకాండలన్నీ యథావిధిగా అన్నదమ్ములిద్దరూ ముగించారు ఆ తరువాత జగన్నాథంగాని గోపాలంగాని పార్వతి సంగతి ఏనాడూ తలచేవారు కాదు ! ఎప్పుడన్నా గుర్తుకు వస్తే జానకి భర్త దగ్గిర పార్వతి సంగతి ప్రస్తావించుతూ వుండేది గోపాలం విసురుగా లేచి అవతలకి వెళ్ళిపోయేవాడు ఇహ ఆ తరువాత జానకి కూడా ఆ ప్రసక్తి తీసుకు రావటం మానివేసింది

వ్యాపారానికి అనువయిన ప్రదేశం అంటూ రామనాథం తన మకాం హైదరాబాద్‌కి మార్చాడు అలాగని ధైర్యం చేసి జానక్కి ఉత్తరం వ్రాసింది పార్వతి. దైవవశాత్తు ఆ ఉత్తరం గోపాలం చేతికి వెళ్ళలేదు వ్యాపారం పెట్టిన వేళావిశేషంగాని, పార్వతి ఆ యింట కాలుపెట్టిన వేళావిశేషమన్నా గాని వ్యాపారం దిన దిన ప్రవర్ధమానమయి ఆ మహాపట్నంలో మంచివాడుగా, లక్షలకు అధిపతిగా అనతికాలంలో పేరు పొందాడు కొడుకు లిద్దరినీ బాగా చదివించాలని ఆయన అభిప్రాయం. పెద్దకొడుకు భాస్కర్ యం ఏ ప్యాసయి ఇన్‌కంటాక్సు ఆఫీసరవటంతోనే వివాహం చేశాడు చిన్నకొడుకు శ్రీనివాస్ బి ఏ మొదటి సంవత్సరంలో అడుగుపెట్టాడు పార్వతికి డబ్బుతోపాటు అంతస్థుకూడా పెరిగింది భర్తతో పాటు మీటింగులకు వెళ్ళటం, నలుగురిలోకి రావటం; తరచూ మహిళామండలి వార్షికోత్సవాల్లో పాల్గొనటంలాంటి కార్యకలాపాల్లో నిమగ్నురాలిని చేశాడు రామనాథం వెనుకటి భయం, బెరుకు పోయినవి రాను రాను పార్వతికి

జగన్నాథం జాగ్రత్తపడి కూడబెట్టుకున్నాడు. గోపాలం ఎలక్షన్సు అంటూ వున్న ఆస్తినంతా కర్పూరంలా కరిగించుకోసాగాడు చాలా సంవత్సరాల తరువాత కూతురు విజయ పుట్టటం, ఆ బిడ్డ మంచిచెడులు చూడకుండానే

*(గత సంచిక తరువాయి)*

గోపాలంకళ్ళు మూయటంతో దిక్కుతోచని జానకి ఎలాగో విజయని పెంచి తన అవసానదశలో పార్వతిని పిలిపించి తన బిడ్డ మంచిచెడులతోపాటు బాధ్యత కూడా అప్పచెప్పి కన్ను మూసింది.

తన జీవితం మూడుపువ్వులు ఆరుకాయలు కావటానికి కారకురాలు తన వదినేనన్న కృతజ్ఞత పార్వతికి వుండి విజయను తనతో తీసుకువచ్చింది నా యింటికోడలిగా చేసుకుంటానని !

## 5

చదువుతున్న పేపర్‌ని మడిచి టీపాయ్‌మీద వుంచి లేచి గదిలోకి వచ్చాడు రామనాథం. పార్వతి కళ్ళు మూసుకుని వున్నదేగాని కళ్ళ నుంచి నీళ్ళు కారిపోతున్నవి. అది చూసిన రామనాథం చలించిపోయాడు. పార్వతి బాధపడటం అంటే ఆయన కెంతో వ్యాకులత ! నెమ్మదిగా పార్వతి పక్కన చోటుచేసుకుని పైట కొంగుతో కన్నీరు తుడిచి--

"పార్వతీ ?" అనురాగంగా పిలిచాడు.

భర్త పిలుపుతో ఉలిక్కిపడి లేచి కూర్చోబోయే సరికి వంగునివున్న భర్తను చూసి లేవటానికి వీలులేక పక్కకు తిరిగి పడుకుంది. కాని రామనాథం భార్య బుజం పట్టుకుని తనవైపుకి తిప్పుకున్నాడు.

"ఇప్పుడు బాధపడితేమాత్రం పోయిన జానకి తిరిగి వస్తుందా ? మనసుని కుదుటపర్చుకోవాలి గాని !"

"నా జీవితాని కింత వెలుగుని చూపించిన వదినను యెలా మరిచేది ? అన్నయ్య ఆస్తినంతా పార్టీలంటూ అవచేసి వాళ్ళను నిష్టదరిద్రులను చేసి వదిలి మరీ చనిపోయాడు. అలాంటి పరిస్థితిలో కూడా నా సహాయాన్ని ఆపేక్షించని వదిన యెంత గంభీరమయిన వ్యక్తి అర్థమవుతోంది విజయను ఒక మనిషిగా తీర్చిదిద్దగలనేమోనని !" ఆ మిగతా మాటను చెప్పలేకపోయింది పార్వతి.

***జరిగిన కథ 4*** **ముప్పయ్యేళ్ళతర్వాత** పుట్టింటి కెళ్ళిన పార్వతమ్మ వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకు వస్తుంది తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మే నని రామనాథం నమ్మకం పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి.సుందరికి నల్గురితో కలిసి మెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకు తనం ఎక్కువ. పాతికేళ్ళ క్రితం.. పరంధామయ్యగారి కొడుకులు జగన్నాథం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు కాపురానికి వెళ్ళకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాథంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్ళు మూస్తాడు పరంధామయ్య

"ఇదంతా తనిచ్చిన డబ్బుతోనేగా వ్యాపారం చేసి సంపాదించింది ? అందుకే ఫరమంతా జానకిఅక్క పేరపెట్టి మరీ నడుపుతున్నాను ఆమె అంటే నాకెంతో గౌరవం వున్నది కనీసం మాటమాత్రంగానైనా తెలియచేయకుండా అజ్ఞాతవాసం చేసిందంటే ? నాకూ బాధగానే వున్నది విజయ చిన్నపిల్ల ! పల్లెటూరి వాతావరణలో వుండివచ్చింది ఇక్కడ పద్ధతులుకి అలవాటుపడేవరకూ వెంటవుండి అన్నీ నేర్పటంతోపాటు ఇక్కడ అలవాట్లుకి క్రమేపీ అలవాటయ్యేటట్లు చూడు ! విజయని తీసుకు రావటంలో నువ్వు తొందరపడ్డావని అన్నానేగాని ఆమె మంచి చెడులు చూడవద్దని అనటంలేదు ! నీ కోడలు చూస్తే నోరుకి హద్దూపద్దూ లేకుండా వాగుతుంది నీ చిన్నకొడుకంటావా ? వాడే క్షణంలో ఏం చేస్తాడో ? ఏమంటాడో ఆ భగవంతునికే తెలియదు అందుకనే భయపడ్డాను ఈ ఆస్తంతా విజయది కాదూ ? యెన్నితరాలు కాలుమీద కాలు వేసుకుని కూర్చుని తిన్నా తరగనంతగా సంపాదించానుగా !"

"విజయ పుట్టిందీ పెరిగిందీ పల్లెటూరు అయినా వదిన యెంతో పద్ధతిగా పెంచింది ఎందుకంటారా ? జూనియర్ కాలేజీలో ఇంటర్ ప్యాసయింది. నా చిన్నకొడుకువల్ల కోడలివల్ల యెలాంటి అమర్యాదా జరుగదు. సుందరి తొందర పడినా భాస్కర్ వున్నాడు శ్రీను తొందరపడి ఏదన్నా అయితే సమర్ధించుకుని వాడిని మందలించుకోగల తల్లిని నేనున్నాను !" అంది ధీమాగా !

"మరయితే విజయ బి. ఏ చదువుతుందేమో తెలుసుకో ? యెందుకయినా మంచిది హాస్టల్లో వుంచి చదివించటం మంచిదేమో ?"

"అబ్బా ! మీకన్నీ సంశయాలేనండి ? విజయని నా చేతులమీదుగా తీర్చిదిద్దాలని తీసుకు వచ్చానుగాని, ఎక్కడో వుంచి చదివించాలన్న ఉద్దేశ్యం నాకు లేదు అలా చేస్తే లోకం నన్నుచూసి నవ్వుతుంది. ఈ యింటిలోనే విజయ వుంటే ఒకరినొకరు అర్థం చేసుకునేందుకు అవకాశం లభించుతుందికూడాను !"

"అంటే .. ?"

"విజయని శ్రీను కిచ్చి వివాహం చేసుకుంటానని వదినకు మాటయిచ్చాను వాళ్ళిద్దరి వివాహం జరిగితీరుతుంది !" అంది పార్వతి కచ్చితంగా !

"విజయ వివాహ విషయంలో కూడా నువ్వు తొందరపడ్డావు పార్వతీ ! బాల్యచాపల్యం వదలనే లేదు !"

"ప్రతీదానికి నన్ను తొందరపడ్డానంటున్నారు ఈమాత్రం చేయగలిగే అర్హత నాకు లేదనేగా అర్థం ?"

"అదికాదు పార్వతీ ! శ్రీనివాసు తొందర

# బంధం

సరోజినీదేవి




స్వభావం గలవాడు వయస్సుతోపాటు లోకంపోకడను అర్ధంచేసుకోలేకపోతున్నాడు ప్రతీ విషయానికీ నేనే ముందు! అంటూ బయలుదేరుతాడు!''

''మరీ వాడినంత వాజమ్మగా తీసిపార వేయకండి ఏదో కుర్రతనం అలాగే వుంటాయి వాళ్ల దుడుకుపనులు!''

''నీ ముద్దుల కొడుకుకదూ? వాడినలా నే వెనుకవేసుకురా?''

''వాడి వున్నతినే కోరులారన్న సంగతి మీరు మర్చిపోతున్నారు!''

పార్వతి కోపంగా మాట్లాడేసరికి రామనాథం ..గ్గాడు ఒకరికి కోపంవస్తే మరొకరు తగ్గటంలో ఏమ్మాత్రం బాధపడరు. అదీగాక భార్య బాధపడటం అంటే యెంతో బాధ కలుగుతుంది రామనాధానికి

''సరేలే పార్వతి? కాలానుగుణ్యంగా ఎవరికి యెక్కడ వ్రాసిపెట్టివున్నదో? వేచిచూద్దాంగాని నువ్వు లేచి నీ కొడుకు భోజనం సంగతి చూడు!''

అంటూ మంచంమీద నుంచి లేచి హాలులోకి వచ్చాడు రామనాథం

అప్పటికే విజయ లేచి హాలులోకి వచ్చింది పార్వతమ్మకోసమని! రామనాథం ఎదురవ్వటంతో సిగ్గుతో వెనక్కి తిరగబోయేసరికి!

''అమ్మా! విజయ! ఇలారా?''

అన్న రామనాథం పిలుపుతో చటుక్కున ఆగిపోయింది విజయ. క్షణం సందేహించుతునే వచ్చి రామనాథం దగ్గర నిలబడింది.

సోఫాలో తను కూర్చుంటూ విజయని కూడా కూర్చోమని సోఫా చూపించాడు సిగ్గుపడుతునే కూర్చున్నది విజయ

''మీ మేనత్త పార్వతి గురించి, నా గురించి మీ అమ్మగారు అన్ని విషయాలూ చెప్పేవుంటా రనుకుంటాను!'' నవ్వుతూ అడిగాడు

''అంతా చెప్పింది మామయ్యా! మీరు దేముడులాంటివారనికూడా చెప్పింది పెదనాన్నగారి పోరుపడలేకగాని, మిమ్మలను చివరి క్షణంలో నయినా చూడాలని అమ్మ ఎంతగానో తపించి పోయింది!'' చివరి మాట అంటుంటే విజయ కంఠం రుద్ధమయింది

''అవునమ్మా! యింత తొందరగా మీ అమ్మ మరణ వార్త వినవలసి వచ్చినందుకు నేనూ బాధ పడ్డాను. మంచివాళ్లకేనమ్మా మరణం తొందరగా వచ్చేది!''

జానకి చనిపోయిందన్న వార్త రామనాధాన్ని కలచివేసింది. తను మగవాడు కాబట్టి దుఃఖాన్ని లోలోపలే దిగమ్రింగుకుంటున్నాడు. స్త్రీలలో జానకిలాంటి ఉదారచరితులు వుంటారా? అన్నదే రామనాథం సందేహం! తన జీవితానికి రాచబాట ఏర్పర్చిన జానకి రామనాథం దృష్టిలో దేవత!... విజయ పమిటచెంగుతో కళ్లు తుడుచుకోవటంతో కలవరపడ్డాడు

''నీకిక్కడ ఎలాంటి లోటూ జరుగదమ్మా? నీకింకా చదవాలనుకుంటే వెంటనే బి.ఏ.లో

చేరమ్మా? నీకెలాంటి అవరోధాలుగాని అవాంతరాలుగాని వుండవు...!'' అన్నాడు అప్యాయంగా.

''నాకింకా చదవాలనే వున్నది మామయ్యా! కాని మీకు!...'' మాట పూర్తిచేయలేకపోయింది విజయ సంకోచంతో;

''మాకు ఎలాంటి అభ్యంతరం వుండదమ్మా! నువ్వింకా చదవాలన్నా నిశ్చింతగా చదువుకో! నువ్వు ఎలాంటి వ్యాపకం పెట్టుకోకుండా జాగ్రత్తగా చదవటమే నాకు కావలసింది!''

విజయ తల పంకించింది. ఆమెకికూడా చదువుకోవాలని మనసులో వున్నదిగాని పైకి అనలేకపోయింది. తన తల్లి కోరికకూడా తను డాక్టరేట్ చెయ్యాలని. ఇంతలో నాయర్ ట్రేలో రెండు టీ కప్పులను తీసుకొచ్చి టీపాయ్‌మీద వుంచి వెళ్లిపోయాడు. రామనాథం ఒక కప్పు తీసుకుని విజయని కూడా తీసుకోమన్నాడు.

''క్షమించండి మామయ్యా! నాకు అలవాటు లేదు!''

''గుడ్!... అలా వుండాలమ్మా!'' నవ్వాడు రామనాథం.

పార్వతమ్మ వచ్చి వారి ఎదురు సోఫాలో కూర్చున్నది. మేనకోడలిని టీపాయ్‌మీద వున్న టీ కప్పుని మార్చి మార్చి చూసింది. తనకి అర్థమయిందన్నట్లు చిన్నగా నవ్వుకుంది. విజయకి వాళ్లిద్దరిమధ్యా కూర్చోవటం యిబ్బందిగా వున్నది. రెండు క్షణాలు తటపటాయించుతునే లేచి నిలబడింది.

"నీకేమీ తోచకపోతే మేడమీదకు వెళ్లమ్మా! సుందరి వున్నది. తన దగ్గిర కావలసినన్ని నవల్సు వున్నాయి!"

విజయకి కూడా వాళ్లిద్దరిమధ్య కూర్చోవటం యిబ్బందిగానే వున్నది. సుందరి యెవరో? మేడమీదకి ఏ వైపుకి వెళ్లితే సుందరి గది వస్తుందోకూడా తెలియదు విజయకి. అయినా యిక్కడనుంచి తను లేవటానికి యింతకంటే ఉపాయం ఏమున్నదనుకుని లేచి నిలబడింది.

"హలో మమ్మీ! ఎప్పుడు రావటం...?" మేడ మెట్లు దిగుతునే హాల్లో కూర్చునివున్న పార్వతమ్మ వంక చూస్తూ అడిగాడు శ్రీనివాస్.

"హలో మమ్మీ" అన్న మాట విని ఒటుక్కున ఆగి వెనుతిరిగి చూసింది విజయ

ఎవరీ అమ్మాయి? అనుకుంటూ విజయ వంక చూశాడు శ్రీనివాస్ చూస్తూనే ముఖం చిట్లించుకున్నాడు అతని చూపుల్లోని భావం అర్థంచేసుకున్న విజయ తొందర తొందరగా తన గదిలోకి వెళ్లిపోయింది

"ఎవరమ్మా ఆ అమ్మాయి?"

చివరి మెట్టు దిగుతూ ఆసక్తిగా విజయ వెళ్లిన వైపుకి చూస్తూ అడిగాడు

"ఎవరో ఆ అమ్మాయి! చెప్పకోవా శ్రీనూ?" నవ్వుతూ అడిగింది పార్వతమ్మ

"ఎవరని చెప్పగలనమ్మా! ఎప్పుడూ యెక్కడా చూసినట్టులేదే?"

"చూడలేదుగాని; విజయ నీ చిన్నమామయ్య కూతురు ఇక్కడనే వుంటుంది మరొక విధంగా చెప్పాలంటే నీకు గురువుకూడాను! నీ తిక్కవేషాలలో అవమానించచూశావా? మర్యాద కాదు! అది మాత్రం గుర్తుంచుకో!" కఠినంగా అన్నాడు రామనాథం

"వ్వాట్ డాడీ? ఒక ఆడపిల్ల నాకు గురువా? దారేపోయేదాన్ని తీసుకువచ్చి యింటిలో పెట్టి, ఉన్నలాసనంమీద కూర్చోబెట్టి నన్ను చేతులు కట్టుకుని, తల వంచుకోమంటే నావల్ల కాదు. అసలు మీకు మతివుండే మాట్లాడు తున్నారా?"

"ఆఁ! బాగా తెలివి తెచ్చుకునే మాట్లాడు తున్నాను గాని ఇహనుంచి వళ్లు దగ్గిరపెట్టుకుని ప్రవర్తించటం నేర్చుకోవాలి!"

"చూడు మమ్మీ! డాడీ నన్ను అవమానించు తున్నారు?"

"మీ డాడీయేకదా? ఫరవాలేదులే శ్రీనూ?" నవ్వుతూ జవాబిచ్చింది పార్వతమ్మ.

తల్లి కూడా తండ్రి పక్షం వహించేసరికి శ్రీనివాస్‌కి కోపం వచ్చింది విజయకి వాళ్ల మాటల్లోని భావార్థాలు అర్థంకాలేదు కొడుకుని ద్వేషించే తండ్రి వుంటాడా? అన్న అనుమానం కూడా కలిగింది.

శ్రీనివాస్‌కి కోపం వచ్చింది విసురుగా బైటికి వెళ్లి స్కూటర్ స్టార్టుచేసి గేరు మార్చి వెళ్లిపోయాడు. స్కూటర్ శబ్దం దూరమయిన తరువాత చిన్నగా నిట్టూర్చి భార్యని ఉద్దేశించి అన్నాడు --

"వాడికి ముక్కుమీదనే వుంటుంది కోపం. తొందర యెక్కువ! వీడికింకా జ్ఞానం యెప్పటికి వస్తుందంటావ్?"

"వయస్సుతోపాటు వచ్చే తొందరేగాని; విజయ తప్పక వాడిని మార్చుతుంది. అదీగాక ప్రతీ చిన్న విషయానికీ వాడిని సాగతియ్యటం; యెంతమందిలో వున్నా అవమానించటం మీకు అలవాటయిపోయింది. అందుకే వాడికి కోపం!"

"కన్నబిడ్డను పొగిడితే భవిష్యత్తు దెబ్బతింటుంది పార్వతీ! ప్రతీ చిన్న విషయాన్నీ విమర్శించుతూవుంటే తనలోని దోషత్వాన్ని సరిదిద్దుకోగలుగుతాడు!"

"సరిదిద్దుకోగలంత తప్పలేమి చేశాడని? మీ ధోరణి మీదేగాని మరొకళ్లు చెప్పేది అర్థం కాదు!" కోపంగా అన్నది పార్వతమ్మ

"వాడినిలాగే వెనుకవేసుకునిరా! రేపు వాడి వేష్టలు చూసి ఏడుస్తూ కూర్చోవలసింది నువ్వే! అన్నట్టు విజయ బి. ఏ. లో చేరతానంటోంది. రేపు కొంచెం తీరుబడి చేసుకుని మీ స్నేహితురాలు; అదే! మహిళా కాలేజీ ప్రిన్సిపాల్ శకుంతల నీ స్నేహితురాలేగా? నువ్వు అడిగితే కాదనలేదు. బట్టలేమయినా కావాలంటే తీసుకో! ఇహనుంచీ విజయ మన మనిషే కాబట్టి మన తాహతుకి తగ్గట్టుగా వుండాలిగా! ఇవన్నీ నువ్వు చూసుకోవాలి!"

"నాకివన్నీ తెలియవంటారా? ఏమిటి? ఆ కాలేజీకి డోనేషన్ క్రింద పాతికవేలు యిచ్చింది మనమే కాబట్టి ఆపాటి చెయ్యక ఏం చేస్తుంది శకుంతల? యెందుకయినా మంచిది! రేపు మీరుకూడా ఫోన్‌చేసి చెప్పండి ఆమెకు!"

"అలాగే! ఆఫీసుకి వెళ్లేముందు మరొకసారి ఫోన్ చేయవలసిన సంగతి గుర్తుచెయ్యి! రేపటి నుంచీ నాకు ఖాళీయే వుండదు. ఎందుకయినా మంచిది శ్రీనివాస్‌ని ఓ కంట కనిపెడుతూ వుండు! వాడికి తొందర యెక్కువ! అలాగే సుందరని కూడా! తనంత గొప్పది లేదని విర్రవీగే స్వభావం. ఇవన్నీ నీకు తెలియనివికావు అయినా నా బాధ్యత నాకున్నదిగా!"

భర్త యింతగా చెప్పతున్న తన చిన్నకొడుకు శ్రీనివాస్ సంగతి పార్వతమ్మకి తెలును. ఆమెకే అప్పుడప్పుడు అనిపించుతుంది... తన గారాబమే వాడినిలా పెంకెగా మార్చినదని! అలాగని భర్త దగ్గిర అంగీకరించలేదు. ఆ కాన్పు అతి కష్టం కావటంతో పుట్టిన బిడ్డను అపురూపంగా చూసుకున్నది. ఇంక పిల్లలు పుట్టరని తెలిసిననాడు శ్రీనివాస్ మీద అంతులేని అవ్యాజానురాగం కలిగింది. ఆ అవ్యాజానురాగమే శ్రీనివాస్‌ని మొండివాడుగా తయారు చేశాయి. శ్రీనివాస్ అడిగినప్పుడల్లా డబ్బు యిచ్చి డబ్బు విలువ తెలియని వ్యక్తిగా తయారుచేసిందీ తనే! అయితేమాత్రం? యింత ఆస్తి వున్నది. ఎవరు తిన్నా; యెలా ఖర్చుచేసుకున్నా వాళ్లిద్దరిదేగదా? అనిపించేది పార్వతమ్మకి డబ్బుతో పెద్దకొడుకు భాస్కర్‌కి అవసరంలేదు. తనే సంపాదించు కుంటున్నాడు. ఇకపోతే శ్రీనివాస్ ఒక్కడేగా? అనిపించే పార్వతమ్మ శ్రీనివాస్ అడిగినంతా యిచ్చేయటం మొదలుపెట్టింది. పదులల్లా వందల్లోకి మారిపోయింది శ్రీనివాస్ డబ్బు అడగటం; కొంత భర్తకి తెలియకుండాను, తెలిసి కొంత యిస్తుండేది.

విజయని బాగా చదివించి ఈ ఇంటికి రాణిని చేసి జానకి రుణం తీర్చుకోవాలన్న ఆలోచన విజయని చూసిన మరుక్షణంలో పార్వతమ్మకి కలిగిన అభిప్రాయం. ఇంచుమించు రామనాథం కూడా అలాగే ఆలోచిస్తున్నాడుగాని పైకి ఏమీ వ్యక్తపర్చటంలేదు అలాగే చూస్తూ వుండి పోయాడు



మారిషస్ విద్యామంత్రి శ్రీ జగత్ సింగ్—మాకా అనే పూరిలో యువతీవల మిమిక్రీ ప్రదర్శన చేసిన సుప్రసిద్ధ మిమిక్రీ కళాకారుడు శ్రీ ఎస్. వేణుమాధవ్‌ని అభినందిస్తున్న దృశ్యం

విజయకి ఏమీ తోచక ఇంటిముందున్న తోటలోకి వెళ్లింది. రకరకాల పూలచెట్లను, వాటికి నీళ్లు పెడుతున్న మాలిని చూస్తూ కొంతసేపు నిలబడింది. ఆ తరువాత పూలమొక్కలను పరిశీలించసాగింది

ఒకవైపున బోగన్‌విల్లా; సన్నజాజి ఒకదాని కొకటి పోటీపడుతున్నట్లుగా పైపైకి ఎగ్రబాకుతున్నవి. కారిడార్ వరకూ రెండువైపులా బారులు తీర్చి గాలికి తలలూగించుతూవున్న క్రోటన్సు, రకరకాల గులాబీలు! మల్లెలు! కనకాంబరాలు! జంట గులాబీలను తెంపి జడలో పెట్టుకున్నది. ఆ తరువాత లోపలికి వచ్చి మేడమీదకి వెళ్లింది. క్రింద వున్నంత పైనకూడా వున్నది బాల్కనీలో రకరకాల పూలకుండీలు! ఒక గది తలుపుమీద "శ్రీనివాస్" అన్న నేంబోర్డు గల ప్లాస్టిక్ ప్లేటు వుంది. ఆ గది శ్రీనివాస్‌దని గ్రహించింది ఏమయినా పుస్తకాలు వుంటే తెచ్చుకోవచ్చునని తలుపుమీద చెయ్యివేసి అంతలోనే ఆగిపోయింది

శ్రీనివాస్ అనుమతి లేనిదే తానా గదిలోకి వెళ్లటం అంత సభ్యత కాదనిపించి నెమ్మదిగా బాల్కనీలోకి వెళ్లి నిలబడింది మేడమీద నిలబడి

తోటలోకి చూస్తుంటే ఎంతో అందంగా కనిపించింది విజయ కళ్లకు. నౌబత్ పహాడ్ నుంచి కొత్తగా వెసిన దేవాలయం నుంచి పబ్లిక్ గార్డెన్ వరకూ కనిపించసాగింది. విశాలమయిన ఆ రోడ్లను చీమలబారుల్లా రోడ్డుమీద తిరిగే కార్లు; టాక్సీలు; ఆటోలుని చూసి నవ్వుకుంది. అలా ఎంతసేపు వున్నదో విజయకీ తెలియదు. వీధి లైట్లు వెలగటంతో ఉలిక్కిపడి వెను తిరిగిన విజయకి క్రిందకి వెళ్లే మెట్ల గుమ్మానికి ఆనుకుని తనవంకే చూస్తున్న శ్రీనివాస్‌ని చూడగానే తెల్లబోయింది ఆమె గుండెలు దడదడ లాడాయి. ఇంత దగ్గిరగా శ్రీనివాస్‌ని చూడటంతో సిగ్గుపడింది అతన్ని తప్పుకుని వెళ్లాలనిపించినా అడుగు ముందుకు పడలేదు విజయకి.

"ఛాయ తక్కువ అయినా ఎంత బాగుంది?"

"ఎందుకలా చూస్తాడు? కొరికేసేలా చూస్తాడేమిటి?" అనుకుంది

విజయ వెళ్లటానికి దారి యిచ్చేందుకు అన్నట్లుగా ముందుకు నడిచాడు.

శ్రీనివాస్ చూపు యెంతో బాధనిపించింది విజయకు తొందరగా మెట్లవైపుకి వచ్చి క్రిందకి దిగబోతూ అప్రయత్నంగా వెనుతిరిగి చూసింది శ్రీనివాస్‌కూడా వెళ్లే విజయవంక చూస్తున్నాడు ఇద్దరి చూపులూ ఆ క్షణంలో కలుసుకున్నవి తొందరగా తన చూపులను మరలించుకుని క్రిందకి వచ్చేసింది. మామయ్య అన్న మాటల్లో అసత్యం లేదు! అనుకుంది. హాలులోనే ఎదురయింది సుందరి. విజయని నఖశిఖపర్యంతం చూసింది పరీక్షగా!

"విజయ అంటే నువ్వేనా?" అనడిగింది సుందరి.

"అవునండీ!" అంది బెదురుగా!

"ఈ యింటిలో వున్నవాళ్లకే అతీగతీలేదు వాళ్ల యోగక్షేమాలు తెలుసుకోగల తీరికే అత్తగారికి లేదే? నిన్ను భరించుతానని, నీ మంచిచెడులు చూస్తానని యెలా తీసుకు వచ్చారు?"

"నాకా విషయాలన్నీ తెలియవు!" తల వంచుకుని జవాబిచ్చింది.

"అవునులే! నీకేం తెలుస్తుంది! మా అత్తగారి పద్ధతే వేరు! అర్థంచేసుకొనుటకు ఆలస్యం అయినాసరే! అర్థంచేసుకునేందుకు ప్రయత్నించు చూస్తుంటే నువ్వు పల్లెటూరి నుంచి వచ్చినట్టున్నావు? - చదువుకున్నావా?"

"ఆఁ! ఇంటర్ పరీక్షలు రాశాను పాసయ్యాను!"

"ఇంక ఏమి చెయ్యాలని?"

"తెలియదండీ?"

సుందరి పెద్దగా నవ్వుతూ అడిగింది — "నీకేమీ తెలియకుండానే యిక్కడికి వచ్చావన్న మాట?"

"అమ్మ చనిపోతూ అత్తయ్యకి అప్పగించింది ఆ తరువాత ఇక్కడికి రావటం జరిగింది."

"అయితే పూర్తిగా! అంటే శాశ్వతంగా ఇక్కడే వుండిపోయే ఏర్పాటు మీదనే

## రాగబంధం

వచ్చినట్టున్నావ్! గుడ్! అలావుండాలి! అంతే గొరెలబుట్టలో పడ్డాడట వెనుక యెవరో అదృష్టవంతుడు. అలాగే జరిగింది నీ పనికూడాను మీ అత్తయ్య చాలా మంచిదేగా! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుతుంది. నువ్వు మహారాణిలాగా వుండవచ్చు!"

అంటూ సుందరి వెళ్లిపోయింది. అవాక్కయి నిలబడిపోయింది విజయ. ఆ మాటల్లో ఒక్కప్రక్క హేళన; మరోప్రక్క ద్వేషమూ ప్రస్ఫుటించాయి విజయకి. తన రాక అయిష్టంగా వున్నది. సుందరి అంటే ఈమే కాబోలు! సాటి మనిషిని గౌరవించలేని కుసంస్కారి! అనుకుంటూ పార్వతమ్మ వున్న గదిలోకి వెళ్లింది. భాస్కర్ నిలబడి తల్లితో మాట్లాడుతున్నాడు. నారిద్దరినీ చూసి రెండడుగులు ఛప్పున వెనక్కివేసింది.

"రామ్మా విజయా! ఎవరో కాదు. మీ పెద్ద బావ! రా! రా!" అంది పార్వతమ్మ.

భాస్కర్ చిన్నగా నవ్వుతూ విజయవంక చూసి తిరిగి పార్వతమ్మవంక చూసి అన్నాడు --

"మేనత్త పోలిక వస్తే అదృష్టవంతురాలంటారు కదమ్మా! విజయ ఎంతో అదృష్టవంతురాలవుతుంది అమ్మా!"

"పోలిక వస్తేనే అదృష్టవంతురాలయితే యింకేం?.."

"అది కాదమ్మా!" అని విజయవంక చూసి "లోపలికి రామ్మా విజయా!" అన్నాడుభాస్కర్

విజయ నెమ్మదిగా లోపలికి వచ్చి మేనత్త పక్కన నిలబడింది తల వంచుకుని

"ఏం చదువుకున్నావమ్మా?" అనడిగాడు భాస్కర్ విజయ సిగ్గుపడటం చూసి.

"ఇంటర్ పాసయ్యానండీ?" తల వంచుకునే జవాబు చెప్పింది

"అండీ కాదమ్మా! పెద బావ!" అంది పార్వతమ్మ.

"కొత్త కదమ్మా విజయకి. నాకు అత్తయ్య గుర్తేనమ్మా! స్వార్థం లేని మనిషి అత్తయ్య! చివరి క్షణం వరకూ మన సహాయం అడగలేదంటే ఎంత పట్టుదలగల మనిషో అర్థం అవుతోంది!"

తల్లి మాట వినేసరికి విజయ కళ్ళు చెమర్చాయి. అది చూసి బాధపడ్డాడు భాస్కర్

"ఊరుకోమ్మా విజయా! తల్లిగా నీకెంతో అత్తయ్యగా మా కంత అభిమానం మంచిని ఎప్పటికీ మర్చిపోలేం! నీకిక్కడ ఎలాంటి లోటూ లేదుగాని ఉత్సాహంగా వుండమ్మా!" అన్నాడు భాస్కర్.

ఇంతలో నాయర్ కప్పులతో టీ తీసుకొచ్చి ఒక్కొక్క కప్పే తీసియిస్తున్నాడు విజయ దగ్గిరకు వచ్చేసరికి వద్దని తల అడ్డంగా ఆడించింది

"పోనీ పాలు అలవాటు చేసుకోకూడదమ్మా విజయా?"

"ఉదయం మజ్జిగ త్రాగే అలవాటు తప్పితే పాలు కూడా అలవాటు లేదు పెదబావగారూ!" అంది నెమ్మదిగా!



'భలే అల్లుడు' లో

"గారూ! అవసరంలేదమ్మా! మనమంతా ఒక కుటుంబం మనలో మనకి మర్యాదలు మన్ననలు అవసరంలేదు!"

భాస్కర్ అంటూవుండగా సుందరి అక్కడికి వచ్చింది విసురుగా!

"కబుర్లు చెప్తూ యిక్కడ వున్నారా? ఫోన్ వచ్చింది. అర్జంటుగా మాట్లాడాలంటున్నాడు మీ బాస్!"

అని తిరిగి మేడమీదకి వెళ్లిపోయింది అంతే విసురుగా సుందరి కప్పుని టీపాయ్‌మీద వుంచి తొందరగా మేడమీదకి వెళ్లాడు భాస్కర్ రిసీవర్ తీసుకుని బాస్‌తో మాట్లాడాడు ఆ తరువాత రిసీవర్ హుక్‌మీద వుంచి బట్టలు మార్చుకుంటుండగా సుందరి విసుగ్గా మొహం పెట్టింది

"సినిమాకు వెళ్లాలనుకున్నాను తిరిగి ప్రయాణం అవుతున్నారేమిటి?" అనడిగింది

"బాస్ అర్జంటుగా రమ్మనమని చెప్పారు సినిమాకు వెళ్లాలంటే అమ్మతో కలసి వెళ్ళు! విజయ కూడా వున్నదికదా? తనకీ కొత్త! వెంటవేసుకుని నాలుగుసార్లు బైటికి వెళ్లితే విజయకి కొంత అలవాటు అవుతుంది!"

"ఆఁ! దారేపోయేవాళ్లను వెంటబెట్టుకుని వీధులవెంట తిప్పే ఖర్మ నాకేమీ పట్టలేదు!"

"సుందరీ?" అసహనంగా పిలిచాడు

"ఆఁ! అదేమంటే ముక్కుమీద వుంటుంది కోపం! ఎప్పుడన్నా సినిమాకు వెళ్దాం అనుకుంటే చాలు! యెక్కడో అక్కడికి వెళ్లిపోతారు"

"చెకింగ్‌కి వెళ్లాలి తప్పదు సుందరీ! ఒకరి దగ్గిర నౌకరీ చేసేటప్పుడు వాళ్లు చెప్పినట్లుగానే మనం నడుచుకోవాలిగాని, మనం చెప్పినట్లుగా వాళ్ళు నడవరుకదా?"

"ఏ? . మీకా ఉద్యోగం లేకపోతేనేం? కాలుమీద కాలువేసుకుని కూర్చుని తిన్నా జరిగేటంత ఆస్తి వున్నది!"

"ఉద్యోగం పురుషలక్షణం! అణకువ ఆడదాని లక్షణం!"

[34వ పేజీ చూడండి]





శారద, కృష్ణంరాజు

★ "మొరటోడు" చిత్రం తాలూకు రెండో షెడ్యూలు పూర్తయ్యేసరికి, పదకొండు రీళ్ళు తయారైంది. ఈ చిత్రానికి తమిళ ప్రముఖుడు నాగేష్ కథకుడు దర్శకుడు గావడం ముదావహం

★ మారుతీ ప్రొడక్షన్స్‌కు అక్కినేనిగారు రాబోయే మార్చిలో కాల్‌షీట్లు యిచ్చినట్లు, నిర్మాత ఏ ఎల్ కుమార్ చెప్పారు ఈ చిత్రానికి జి సి శేఖర్ దర్శకుడు.

★ మంజుల వివాహానంతరం పొదుపు జీవితాన్ని అలవాటు చేసుకున్నట్లు వార్త.

★ శ్రీ దాసరిచే పరిచయం కావింపబడిన విలన్ నటుడు మోహన్‌బాబు, తెలుగు చిత్ర రంగంలో బిజీయస్ట్‌గా వుంటున్నారు ఇరవై చిత్రాలలో నటిస్తున్న ఏకైక నటుడుకూడా మోహన్‌బాబేమో!

★ ఇప్పుడున్న తారల్లో, వాణిశ్రీ, జయప్రద, జయచిత్ర, జయసుధ, ప్రభగార్లకు పరిశ్రమలో, ప్రేక్షకలోకంలో పేరు ప్రఖ్యాతులు వున్నాయి.

★ తమిళ హాస్య నటి మనోరమ తెలుగు రాజబాబుతో ఒక తమిళ చిత్రంలో నటిస్తూంది. ఆయనతో ఎక్కువ చిత్రాలలో నటించాలన్న అభిప్రాయాన్ని, మనోరమ వెల్లడించిందట.

★ తమిళ నిర్మాతలకు తెలుగు చిత్ర నిర్మాణంపై స్పెషల్ మోజు ఏర్పడిన కారణంగా, కొత్త సంవత్సరంలో తెలుగు చిత్రాల సంఖ్య నూరు దాటేట్టుంది.

★ సురేష్ ప్రొడక్షన్స్ హిందీలో నిర్మించబోయే "జీవనతరంగాలు" చిత్రానికి జితేంద్రను కథానాయకుడుగా, బాపయ్యను దర్శకుడుగా శ్రీ రామానాయుడు ఎంపిక చేశారు నవంబర్ నుంచి షూటింగు ప్రారంభం

## టూకీగా టాకీ న్యూస్

★ "నాయుడు బావ" చిత్రానికి ఛాయ గ్రహణ దర్శకుడుగా పని చేస్తున్న పి ఎస్ ప్రకాష్‌ను తన పర్మనెంటు మనిషిగా నిర్ణయించినట్టు, నిర్మాత ఎమ్ ఎస్. రెడ్డి చెప్పారు

★ ప్రముఖ హాస్య నటుడు రాజబాబు అక్టోబర్ 20న పుట్టారు ఆ రోజున ప్రముఖులను సన్మానించడం తన కర్తవ్యంగా పెట్టుకున్న ఆయన, ఈసారి "నటి శిరోమణి" సావిత్రిని సత్కరించ నిర్ణయించారు

''మొరటోడు'' లో...



'సూర్యచంద్రులు' లో

## టూకీగా టాకీ . . .

★ హాస్యనటుడు రాజబాబుకు ''సర్వర్ సుందరం'' చిత్రాన్ని కొద్ది మార్పులతో తీయాలన్న తలంపు ఏర్పడింది.

★ ''మొరటోడు'' చిత్రాన్ని హిందీలో వినోద్‌ఖన్నాతో, తమిళంలో శివాజీగణేశన్‌తో తీయాలన్న కోరిక, సురేష్ అధినేతకు లేకపోలేదు.

★ వర్ధమాన తార ''జయలక్ష్మి'' తన పుట్టినరోజు పండుగను, మీనాక్షి కళ్యాణ మండపంలో వైభవంగా జరుపుకుంది. ఆ రోజున పాత్రికేయులతోబాటు వినాయకుడి దీవెనలను కూడా ఆమె అందుకుంది. కారణం... ఆ రోజు వినాయకచవితి.

★ సమత ఆర్ట్సువారి చిత్రం ''మల్లెపూవు'' నవంబర్ 10 న విడుదల చేస్తారు.

శ్రీ వి. మధుసూదనరావు దర్శకత్వం నిర్వహించిన ఈ చిత్రంలో ''కాశ్మీరు అందం'', రావుగోపాలరావుగారి 'హాస్యం' ప్రత్యేక ఆకర్షణగా వుండగలవు. లక్ష్మి ... జయసుధ నాయికలు. ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతం సగ ప్రాణం.

'యమగోల' లో...

# సినిమా

★ ప్రపూర్ణ మూవీస్‌వారి ''భలే అల్లుడు'' వర్ణచిత్రం అక్టోబర్ 14వ అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదల అవుతుంది

శ్రీమతి శారద ముఖ్యపాత్రను పోషించిన ''భలేఅల్లుడు' వర్ణచిత్రంలో కృష్ణంరాజు .. పద్మప్రియ ప్రేమజంటగా నటించారు. ముఖ్య పాత్రలను రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, మోహన్‌బాబు, చంద్రమోహన్, ''ఫటాఫట్'' జయలక్ష్మి పోషించారు శ్రీవీరశేశ్వరరావు, చౌదరి నిర్మించిన యీ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు

ఈ బ్యానర్ నిర్మించనున్న రెండో చిత్రంలో అక్కినేని నాయక పాత్రను పోషించగలరని తెలుస్తోంది

★ విజయ. మాధవి పిక్చర్స్ రంగుల్లో నిర్మించిన నవరసభరిత చిత్రం నవంబర్‌లో అన్నపూర్ణా. నవభారత్ శ్రీ తారకరామ పిక్చర్స్ ద్వారా విడుదల అవుతుంది

శ్రీ నాగేశ్వరరావు ''ఆత్మీయుడు''గా నటించిన యీ చిత్రంలో సత్యనారాయణ, రావు గోపాలరావు, మోహన్‌బాబు, రాజబాబు, అల్లు రామలింగయ్య, జయమాలిని, హలం, ఛాయాదేవి, మాధవి, వై.విజయ సహాయ పాత్రలను పోషించారు

అక్కినేని... జయచిత్ర గార్ల శృంగార దృశ్యాలు ప్రేక్షకులను అలరిస్తాయి. మురళీమోహన్ ... జయమాలిని పాల్గొన్న నృత్య దృశ్యం కన్నుల పండుగ చేస్తుంది. శ్రీ వడ్డె శోభనాద్రి నిర్మించిన యీ చిత్రానికి తాతినేని రామారావు దర్శక,కథకుడు.

—శ్రీనివాస్



''కోయరాజా-కోయపిల్ల''లో ఈ ఏటి ఉత్తమనటి లక్ష్మి

# పెరిగిన తెనుగు చిత్రాల సంఖ్య

గత సంవత్సరంకన్నా ఈ ఏడు తెలుగు చిత్ర నిర్మాణ సంఖ్య పెరిగింది చిత్రానికీ చిత్రానికీ మధ్య తగు వ్యవధి లేకుండా నెలకు దాదాపు ఆరేడు చిత్రాలు విడుదలవుతున్నందున ఆర్థికంగా ఆశ్నే విజయం సాధించలేకపోతున్నాయనే విషయం అందరూ ఎరిగినదే.

సినిమా ప్రేక్షకుల గురించి ఒక నిర్మాత చెప్పిన వివరాలు .

| | |
|---|---|
| కుటుంబ పెద్దలు | 18 శాతం |
| ఉన్నతోద్యోగులు | 24 శాతం |
| విద్యార్థి, విద్యార్థినులు | 44 శాతం |
| మధ్యతరగతి కుటుంబీకులు | 26.3 శాతం |
| కార్మికులు, వగైరా | 20 2 శాతం |
| వయోవృద్ధులు | 14 శాతం |

ఈ ప్రేక్షకులను 'క్లాస్, మాస్' అని రెండు వర్గాలుగా విభజిస్తే, వీళ్లను చిత్రాలలో ఆకర్షించే అంశాలు .

| | క్లాస్ | మాస్ |
|---|---|---|
| తారలు | 38 శాతం | 55 శాతం |
| పాటలు | 35 శాతం | 50 శాతం |
| దర్శకత్వం | 50 శాతం | 28 శాతం |
| సంగీతం | 35 శాతం | 60 శాతం |
| స్క్రిప్ట్ | 60 శాతం | 20 శాతం |
| నటన | 65 శాతం | 50 శాతం |
| ప్రొడక్షన్ వేల్యూస్ | 32 శాతం | 39 శాతం |

వినోదంకోసం సినిమాలకు వెళ్లే స్త్రీలు 50 శాతం, పురుషులు 30 శాతం. పొద్దు గడవడంకోసం వెళ్లే స్త్రీలు 16 శాతం, పురుషులు 21 శాతం యువకులలో 20 శాతం యువతులలో 12 శాతం తమ అభిమాన తారలను చూడడానికి వెళ్తుంటారు.

విడుదలయ్యే ప్రతి సినిమా చూడడానికి ఎంతమందికి వీలవుతుంది ? చిత్ర నిర్మాత లందరూ ఆలోచించే విషయం ఇదే. కాని, అందరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చి, కర్నాటక ప్రాంతంలోలాగా చిత్రానికీ చిత్రానికీ విడుదలమధ్య తగు వ్యవధి వుండేలా చూడడం శ్రేయస్కరం

* * *

★ "అన్నక్కిళి" అనే తమిళ చిత్రం రజతోత్సవం జరుపుకుంది. ఆ కథను ఎస్. పి. టి. పిలిమ్స్ వారు "అమ్మాయి" పేరున సినిమా స్కోప్‌లో నిర్మిస్తున్నారు జయప్రద, రంగనాథ్, రావుగోపాలరావు, రజనీకాంత్, కాంతారావు, జగ్గారావు, మాడా, పద్మప్రియ, కృష్ణకుమారి, నిర్మల, గిరిజ తారాగణం కథ: పంజు అరుణాచలం. మాటలు మోదుకూరి జాన్సన్ సంగీతం: ఇళయరాజా. కూర్పు కందస్వామి పూర్తిగా ఔట్‌డోర్‌లో తయారవుతుందీ వర్ణ చిత్రం.

★ సెప్టెంబర్ 11 నించి అక్టోబర్ 6 వరకు చిత్తూరు పరిసర ప్రాంతాల్లో జరిగే షూటింగ్‌లతో యువ చిత్ర వారి "సీతామహలక్ష్మి" చిత్రం చాలావరకు పూర్తవుతుంది పూనా ఫిలిమ్ అండ్ టెలివిషన్ ఇన్‌స్టిట్యూట్‌లో 'నటన'లో బంగారు పతకం పొందిన తాళ్లూరి రామేశ్వరి ఈ చిత్రంలో నాయిక. చంద్రమోహన్, పల్లవి, అల్లురామలింగయ్య, ఈశ్వరరావు, నంకాయల సత్యనారాయణ, జి ఎస్ ఆర్ మూర్తి, సుధ, జానకి, పి ఎల్. నారాయణ, అంకినీడుప్రసాద్, కృష్ణాజీ యితర పాత్రధారులు స్క్రీన్‌ప్లే, దర్శకత్వం · కె. విశ్వనాథ్. ఛాయ . యు. గోపాల్ శిల్పం . తోట గీతాలు · దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేటూరి సుందరరామమూర్తి మాటలు. జంధ్యాల. సంగీతం . మహదేవన్ సహకార దర్శకత్వం : నండూరి విజయ్, కె. జయకుమార్ నిర్మాత . కె మురారి.

★ "మా చిత్రానికి 'అల్లరి బుల్లోడు' అనే పేరు నిశ్చయించాం" అన్నారు మారుతీ కంబైన్స్ ద్వితీయ వర్ణ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న జి పి. శేఖర్ కృష్ణ, జయప్రద, గుమ్మడి, రావుగోపాలరావు, రాజ్‌బాబు, గిరిబాబు, అంజలీదేవి, కె విజయ, జయవిజయ వగైరా నటవర్గం. మాటలు · సత్యానంద్ సంగీతం చక్రవర్తి ఛాయ వి. ఎస్ ఆర్ స్వామి శిల్పం రాజేంద్రకుమార్ సమర్పణ . ఎ ఎల్ కుమార్. నిర్మాత . ఎ గోపాలకృష్ణ.

★ కె. బాపయ్య దర్శకత్వంలో ఏ. రామకృష్ణా రెడ్డి నిర్మించిన "గడుసు పిల్లోడు" వర్ణ చిత్రం విడుదలకు సిద్ధంగా వుంది శోభన్‌బాబు, సత్యనారాయణ, జమున, మంజుల, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు, అల్లురామలింగయ్య నటించారు మాటలు మోదుకూరి జాన్సన్ గీతాలు ఆత్రేయ సంగీతం మహదేవన్ ఛాయ విన్సెంట్ శిల్పం భాస్కరరాజు కూర్పు నరసింహారావు

★ కృష్ణ, కృష్ణంరాజు, మంజుల, సంగీత, మోహన్‌బాబు, మాడా, ప్రభృతులు పాల్గొనే శ్రీ పద్మావతీ పిక్చర్స్ "మనుషులు చేసిన దొంగలు" వర్ణ చిత్రం మూడువంతులకు పైగా పూర్తయింది నిర్మాత యు. సూర్యనారాయణ బాబు దర్శకత్వం. ఎం మల్లికార్జునరావు మాటలు త్రిపురనేని మహారథి సంగీతం. సత్యం. ఛాయ . పుష్పాల గోపీకృష్ణ. కూర్పు కోటగిరి గోపాలరావు. *

'చరిత్ర హీనులు'లో చంద్రమోహన్, దీప






ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: తాతినేని రామారావు, నిర్మాత: యస్. వెంకటరత్నం

ఆంధ్ర, నైజాం లక్ష్మీ ఫిలింస్ సీడెడ్ నవభారత్ ఫిలింస్ నెల్లూరు: టి.వి.ఎస్. ఫిలింస్ మైసూర్: భారత్ పిక్చర్స్ LAKSHMI PUBS alpanc



'చిల్లరకొట్టు చిట్టెమ్మ'లో ఒక దృశ్యం

# సినిమా

### అరంగణాళ్ కొత్త చిత్రం

తెలుగులో "అంతులేని కథ" చిత్రాన్ని అందించిన, తమిళ చిత్ర నిర్మాత రామఅరంగణాళ్ తన రెండో చిత్రానికి షూటింగు తేదీని నిర్ణయించారు.

అక్టోబర్ 12 నుంచి వరుసగా రెండు వారాలపాటు విశాఖపట్నం పరిసర ప్రాంతాలలో మొదటి షెడ్యూలు జరపడానికి నిశ్చయించిన వార్తను, ఆ సంస్థకు సంబంధించిన ముఖ్య వ్యక్తి తెలిపారు

ఆండాళ్ ప్రొడక్షన్స్ తలపెట్టిన బాలచందర్ గారి రెండో చిత్రానికి గణేష్‌పాత్రో రచన్ను, ఛాయాగ్రహణాన్ని లోకనాధ్, సంగీతాన్ని విశ్వనాధం, కూర్పును కిట్టు నిర్వహించగలరని తెలిసింది

ఈ చిత్రంలో తమిళ చిత్రాల అందాల నటుడు ముఖ్య పాత్రధారిగా వుండగలరని తెలిసింది.

### శోభన్‌కు దశ తిరిగింది

1975 లో సూపర్‌స్టార్ స్థానాన్ని ఆర్జించుకున్న శోభన్‌బాబుగారికి, 1976 ఆశాజనకంగా లేకపోయింది. "హీరో యిమేజ్" కృషితో సంపాదించుకున్న శ్రీ శోభన్ మళ్లీ తన స్థానాన్ని సంపాదించుకునేందుకు గట్టిగా కృషి చేస్తున్నారు.

చిత్రాల అపజయం ఆయనలో మొండి పట్టుదలను, తీవ్రమైన కాంక్షను రేకెత్తించి, వైవిధ్యం వున్న పాత్రల పోషణకు దారితీసింది

ఈమధ్య విడుదలయిన "ఖైదీ కాళీదాస్" చిత్రం, శోభన్ స్టార్ వేల్యూను యెంతగానో పెంచింది

రాబోయే ఆయన చిత్రాలన్నీ నిర్మాతలకు లాభాన్ని, ప్రేక్షకులకు ఉత్సాహాన్ని కలిగించేవిగా వుంటాయి.

అక్టోబర్‌లో వచ్చే గడుసు పిల్లోడు, నవంబర్‌లో వచ్చే మల్లెపూవు, డిశంబర్‌లో వచ్చే లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్ వారి చిత్రం .. శోభన్‌కు సూపర్ పొజిషన్ను తెచ్చిపెట్టగల కథా స్తోమతును బడసివున్నాయి

ఆత్మబలం వున్న అందగాడు, కృషి చేస్తున్న ఉత్తమ నటుడు, ఎంతో భవిష్యత్తు వున్న కళాకారుడు .. శ్రీ శోభన్ సెప్టెంబర్ నుంచి విజృంభించినట్టే.

### డి వి ఎస్ కొత్త చిత్రం

విఖ్యాత చిత్ర నిర్మాత శ్రీ డి. వి. ఎస్ రాజు, కొత్త చిత్రాన్ని సెప్టెంబర్ 29 న, పాటల రికార్డింగుతో ప్రారంభించారు

అవార్డు చిత్రాల దర్శకుడు శ్రీ విశ్వనాధ్ దర్శకత్వంలో రూపొందే ఈ కొత్త చిత్రంలో శోభన్‌బాబు .. జయసుధ, సత్యనారాయణ, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు

నవంబర్...డిశంబర్ మాసాలలో "ఊటీ"ని షూటింగు స్థావరంగా, నిర్మాత శ్రీ రాజు ఎంపిక చేశారు.

జనవరి...ఫిబ్రవరి మాసాలలో ఇన్‌డోర్ జరపడానికి అనుకూలంగా, ఆర్టిస్టులుకాల్‌షీట్లిచ్చారు

ఈ రంగుల చిత్రానికి జి. కె రాము, మహదేవన్, కళాధర్, సముద్రాల, పి. వి. రామారావు, విజయ్ ముఖ్య సాంకేతిక సారథులు.



← 'కన్నవారిల్లు' లో నేరెళ్ల లక్ష్మణరావు, సత్యనారాయణ

లక్ష్మీ జ్యోతి ఫిలింస్

# చిల్లరకొట్టు చిట్టెమ్మ

నిర్మాత: ఆర్. యస్. రాజు

సంగీతం: రమేష్ నాయుడు

కథ-మాటలు: దాసం గోపాలకృష్ణ

దాసరి నారాయణరావు

అందరినీ
ఆకర్షించి
అందాలు
చిందిస్తున్న
చిట్టెమ్మ!

తారకరామ
నవభారత్
శ్రీ తారకరామ

THARAKARAMA

---

దైవభక్తులకు
శుభవార్త!

తప్పక
చూడండి!

కేదార్‌నాథ్ నుండి కన్యాకుమారి
వరకు 101 పుణ్యక్షేత్రాలు
దర్శించండి!

భక్తి ముక్తి
దాయక
తెలుగు చిత్రం!

# సంపూర్ణ తీర్థయాత్ర

సంగీతం: పెండ్యాల రచన: శ్రీశ్రీ

శారదా రిలీజ్ PHONE: 75644

## సినిమా

### బాపయ్య నుంచి న్యూవేవ్ చిత్రం

కమర్షియల్ దర్శకుడుగా ముద్ర వేసుకున్న శ్రీ బాపయ్య శ్రీ చరణ చిత్ర నిర్మాత రాజశేఖర రెడ్డిగారికి "న్యూవేవ్" చిత్రాన్ని, జనరంజకంగా రూపొందించారు.

తమిళ రచయిత బాలమురుగన్ వ్రాసిన "చరిత్రహీనులు" అనెడి కథను, దర్శకుడు బాపయ్య ఎంతో ఆసక్తిదాయకంగా, ఎంతో రమణీయంగా, ఎంతో హృద్యమంగా మలచడం జరిగింది.

కొత్తతరహా చిత్రాలను ఆదరించడంలో తాము సుముఖంగా వుంటాము అని ఆంధ్ర ప్రేక్షకులు ఎప్పటికప్పుడు నిరూపిస్తూనేవున్నారు.

"న్యూవేవ్" అంటే కొత్తదనం వున్న చిత్రం. అట్టి చిత్రాన్ని సక్రమంగా తీస్తే, దానిని ప్రజలు ఆదరిస్తారు అని "చిలకమ్మ చెప్పింది" నిరూపించింది.

"చరిత్రహీనులు" చిత్రం కూడా ఆ కోవకు చెందిన మాణిక్యమే గాబట్టి, రాజ శేఖరరెడ్డిగారి తొలి ప్రయత్నానికి ప్రజల ఆదరణ తప్పక లభిస్తుంది.

ఈచిత్రానికి పద్మావతీ గంగాధర్ రచన్ను, చక్రవర్తి సంగీతాన్ని, భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని, జి.వి. సుబ్బారావు శిల్పాన్ని, మస్తాన్‌రావు సహాదర్శకత్వాన్ని, చెంచు రామయ్య ... సుబ్బారావు ప్రొడక్షన్ను నిర్వహించారు



'మనుషులు చేసిన దొంగలు' లో కృష్ణ, మంజుల

"చరిత్రహీనులు" చిత్రంలో ముగ్గురు నాయిక పాత్రలను పోషించారు. ప్రభకు నటిగా ఎక్కువ మార్కులు స్కోర్ చేసే అవకాశం లభించింది దీప... జయలక్ష్మి గ్లామర్ విభాగాన్ని పూర్తిచేశారు

"గుణచిత్ర నటుడు" సత్యనారాయణ కొత్తతరహా పాత్రను పోషించిన "చరిత్రహీనులు" చిత్రంలో జగ్గయ్య, రావు గోపాలరావు, కాంతారావు, చంద్రమోహన్ ముఖ్య పాత్రలను పోషించారు.

బాల నటులు వరలక్ష్మి, రాణి ప్రేక్షకుల సింపతీని గెయిన్ చేసే వేషాలను రక్తి కట్టించారు.

నవంబర్‌లో విజయా పిక్చర్స్ ద్వారా "చరిత్రహీనులు" విడుదల కాగలదు

"చరిత్రహీనులు" చిత్రాన్ని నిర్మించిన శ్రీ రాజశేఖరరెడ్డి డిశంబర్ నుంచి భారీ రంగుల చిత్రాన్ని పూర్తి అవుట్‌డోర్‌లో నిర్మించడానికి నిశ్చయించారు.

పాత.. కొత్త తారలు పాల్గొనే అవకాశం వుందని, దర్శకత్వాన్ని బాపయ్యగారే నిర్వహించ గలరని తెలుస్తోంది.

### బొంబాయిలో బాపయ్య

"దిల్ దార్" చిత్రం ఉత్తరదేశంలో విజయఢంకా మ్రోగించింది. శతదినోత్సవాన్ని దాటి రజత వుత్సవానికి పరుగిడుతూంది.

ఆ చిత్ర దర్శకుడు శ్రీ బాపయ్యను హిందీ నిర్మాతలు అయిదారుగురు తమ చిత్రాలకు అడగడం జరిగింది. కానీ, బాపయ్య అలా చెయ్యక ... మాతృభాషా చిత్రాలకు ప్రాధాన్యత నివ్వడం జరిగింది.

సురేష్ అధినేత హిందీలో నిర్మించనున్న "జీవనతరంగాలు" చిత్రానికి సంబంధించిన ఫైనల్ వర్క్ నిమిత్తం, శ్రీ బాపయ్య బొంబాయిలో పది రోజులు మకాం పెట్టారు.

ఎందరో ఆయన్ను దర్శకుడుగా కాంక్షించారు. కానీ, ఆయన యెవ్వరికీ "అవును...కాదు" అని చెప్పలేదని తెలిసింది.

### బంగారు పంట

సినిమా పేరు కాదు సుమా! ఈమధ్య నేనొక భారీ వర్ణ చిత్రాన్ని చూశాను. ఆ చిత్రంలోని పాటలయితేనేమి, సన్ని వేశాలయితేనేమి, స్టంటు దృశ్యాలయితేనేమి, ఒక దాంతో ఒకటి పోటీపడి కన్నుల పండుగ చేశాయి. బలమైన కథ, పాత్రలకు సరితూగే నటీనటులు, అవగాహన శక్తి వున్న దర్శకుడు, సరయిన సంభాషణల రచయిత కలిసినప్పుడు, ఆ చిత్రానికి విజయము తథ్యము అనిపిస్తుంది కదూ! అది నే చూచిన చిత్రంలో (టీమ్‌వర్క్) కనిపించింది.

పాటల చిత్రీకరణలో దర్శకుడు, ఛాయాగ్రహణ దర్శకుడు, నృత్య దర్శకుడు కొత్త పోకడను చేబూనిన నిజం ఆ చిత్రం చూసినప్పుడు అనిపించింది



'ప్రయాణంలో

అన్నిరకాలుగా బాగున్న ఆ రంగుల చిత్రం పేరు "నా ప్రాణంలో ప్రాణం"

శోభన్‌బాబుగారిని మగవాళ్ళుకూడా ప్రేమిస్తారు, బాలకృష్ణగారి ఫోటోగ్రఫీ ప్రభావ ఫలితంగా. అంత అందంగా ఆయన వున్నారు.

దర్శకుడు శ్రీ లాల్‌కు మరో విజయాన్ని తెచ్చిపెట్టగలదు, లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్ వారి చిత్రం నిర్మాత అనురాధాదేవిగారికి ఈ చిత్రం "బంగారు పంట" కాగలదు.

జయచిత్ర .. దీప, జి. వరలక్ష్మి, సత్యనారాయణ, రాజబాబు, విజయకుమార్, త్యాగరాజు, సాక్షిరంగారావు, రాజనాల, బేబీ స్వప్న, రవికృష్ణ, విజయలక్ష్మి, జయవిజయ ముఖ్య పాత్రలను పోషించిన లక్ష్మి ఫిలిమ్స్ కంబైన్స్ వారి భారీ వర్ణ చిత్రాన్ని, పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తారు



'అర్ధాంగి'లో మురళి, అల్లు



ఎదనిసలు'లో రామకృష్ణ, జయచిత్ర

ఎలాగే జయప్రద... జయసుధలకు **కూడా** సమాన బలం వున్న పాత్రలు లభించాయి.

''మానవుడు దానవుడు'' చిత్రం పది రీళ్లు అయిన ఘట్టంలో, యీ విలేఖరి ఆ చిత్ర దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డిని అభిప్రాయం అడిగాడు.

''నూరు శాతం - నూరు రోజుల చిత్రం'', అని ఘంటాపథంగా వెల్లడించారు, దర్శకుడు రెడ్డి.

ఆ చిత్రం తరువాత శోభన్‌బాబుగారితో, చంద్రశేఖరరెడ్డిగారు పనిచేస్తున్న చిత్రం ''నాయుడు బావ'' గనక, మళ్లీ యీ విలేఖరి దర్శకుడి అభిప్రాయాన్ని సేకరించాడు

''అన్నీ వున్న కమర్షియల్ చిత్రం తప్పక విజయవంతం అవుతుంది'', అన్నారు శ్రీ రెడ్డి

రెడ్డిగారి చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్న రెడ్డిగారికి, ప్రకాష్ ఎంతో సహకరిస్తున్నారు

***కల్లూరిక కొత్త కథ***

భానోదయా ఫిలింస్‌ను స్థాపించారు శ్రీ కల్లూరి నాగేశ్వరరావు. ఆయన అగ్రదర్శకుడు శ్రీ దాసరిని కొత్తతరహా చిత్రాన్ని తీసిపెట్టమని అడిగారు

''స్వర్గం.. నరకం'' చిత్రంవలె, తమ చిత్రంలో **కూడా** వుత్సాహవంతులైన కొత్త కళాకారులకు అవకాశం యివ్వబడుతుందని, ఎగ్జిక్యూటివ్ నిర్మాత శ్రీ ఆర్ సాంబశివరావు చెప్పారు.

శ్రీ ఎస్ పి శివలింగేశ్వరరావు సమర్పించే యీ కొత్తతరహా చిత్రాన్ని (రంగుల్లో) ఒకే నెలలో **పూర్తి**చెయ్యాలన్న నిర్ణయాన్ని, దర్శక... కథకుడు శ్రీ దాసరి తీసుకున్నారు

నాటకానుభవం వున్న ఔత్సాహిక నటీనటులు యీ బంగారు అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటారని ఆశిద్దాం

దాసరిగారికి కొత్త బాటను వెయ్యడం ఆదినుంచి అలవాటే, మరి.

**—శ్రీనివాస్** ★

***ఆంధ్ర కవితే కాదు; ఆంగ్లము కూడా***

''సహజ కవితా సరస్వతి''ని తనదిగా చేసుకున్న ''మల్లెమాల'' ఆంధ్ర కవితనేకాదు ఆంగ్ల కవితనుకూడా వ్రాయగల ప్రతిభావంతుడు అని ''నాయుడు బావ'' నిరూపించింది

''సెక్స్ గరల్'' జయమాలిని కోసం, శ్రీ మల్లెమాల ఒక ఇంగ్లీషు పాటను వ్రాశారు అదేమిటన

''కాల్ మీ ఆన్-సన్‌డే
అయామ్ ఫ్రీ ఆన్ దట్ డే
ఎ బి సి డి ఎక్స్
లైఫ్ ఈజ్ ఫుల్ ఆఫ్ సెక్స్''

ఈ పాటను ఈశ్వరి గానం చేసింది సత్యం సారధి

''మల్లెమాల'' మాట పాటలు వ్రాసిన ''నాయుడు బావ'' వర్ణచిత్రంలో శోభన్‌కు గమ్మత్తయిన, హుషారయిన పాత్ర లభించింది



'గడుసు పిల్లోడు'లో శోభన్‌బాబు, మంజుల

# ప్రశ్నావళి

ఎమ్. ఎస్ బి. — జమ్మలమడుగు

మీరు మీ భర్తగార్ని యెంత కట్నానికి కొన్నారు ?

★ కట్నాలకి వదిలే కవి కారు వారు. 'నా జీవిత పత్రంపై గూడుకట్టుకుని, నన్నే భోంచేస్తూ హాయిగా శరీరం పెంచు, సుఖంగా జీవితం 'సాగించెయ్' అని ఆహ్వానించిన సహృదయులు. కట్నం కానుకా యిచ్చినా నాలాంటి గొంగళీపురుగుని ప్రేమించిన మనిషి తప్ప పెళ్ళాడలేరుకదా ! ఆ గొంగళీపురుగు చక్కని సీతాకోకచిలుకై కన్నులవిందు చేస్తుందనుకున్నారే గాని పాపం ! యిలా గున్నేనుగునై భారం చేస్తుందనుకునివుండరు ! ప్రేమతో వచ్చిన చిక్కే యిది. మన చేతలకి మన సుఖాలకి దుఃఖాలకీ మనమే బాధ్యులం నేరం ఎవరిమీదో నెట్టడానికి వుండదు అందుకే చాలామంది యువతీ యువకులు ప్రేమిస్తారేగాని సాహసించి పెళ్ళికి దిగలేకుండా వున్నారు

డి జె. ఎమ్ — హైదరాబాదు

మిమ్మల్ని చూసి మీరే గర్వపడతారనుకుంటా. నిజమేనా

★ నిజమే నిన్ను గురించి పైవారేమను కుంటున్నారన్న దానికంటే — నిన్ను గురించి నువ్వే మనుకుంటున్నా వన్నది చాలా ముఖ్యం అని నా నమ్మకం.

మీరెందు కస్తమానూ స్త్రీల హక్కులను గురించి జ్ఞాపకం చేస్తుంటారు ?

★ దీపం వెలిగిస్తే చీకటి దానంతట అదే తొలగిపోతుంది ఆలోచన మొలకెత్తిస్తే ఆశయం అదే పొడుకుంటుందని నా నమ్మకం

ఆర్. ఆర్ ఎన్ ఆర్. — కాజీపేట

అంతు తెలియనిది స్త్రీ హృదయం అంటారు కదా మరి పురుషుడు అర్థంచేసుకోవడం యెలా ?

★ ప్రపంచాన్ని జయిస్తున్నాననుకుంటాడే గాని, పెళ్ళాం ఏమనుకుంటుందోనని ఆలోచించడు మగవాడు ఆ పని చేసిననాడు ఆడదాన్ని ఎవరేనా అర్థం చేసుకోకల్గుతారు.

వి వి — సికింద్రాబాదు

మీరు యెవరినీ గౌరవించరా ?

★ ఎందుకు గౌరవించను ? కాని, మన వ్యక్తిత్వాన్ని దెబ్బతీసేదీ, మన మాట వమ్ము చేసేదీ ఏదైనాసరే, యెవరైనాసరే గౌరవించడం అనవసరం అని నా నమ్మకం

ను. వి — ఎమ్మిగనూరు

మీరు జీవితంలో పొరపాటు పనులేమైనా చేశారా ?

★ ఆ చేశాను ఒకటి రెండు, ఆదర్శ వంతంగా సహాయం చేసి, మాటపడ్డాను, అనవసరంగా చాకిరీచేసీ మాటపడ్డాను, ఏ పనీ సగం సగం చేయకూడదన్న పిచ్చినమ్మకంతో చేసిన పనులవి చేసేది రైటని తోస్తే ధైర్యంగా చేసేయాలనీ, తప్పని తెలిస్తే అంత ధైర్యంగానూ మానేయాలనీ కీ. శే. ఖాసావారి సూక్తి అలాగే- తప్పు అని తోచగానే — ఖండించేసుకుని మరిచి పోయాను. అయినా అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది — యింత తప్పు అంచనా యెలా చేశానా అని !

ఎస్ ఎస్. ఆర్ — చీరాల

పెండ్లి చేసుకొనేదాకా పెద్దలు ఊరుకోరు కాని ఆ పెద్దలే పెళ్ళి తరువాత ఆటంకములు యెదురైతే ఆర్థిక యిబ్బందులలో సహాయం చేయరు సుఖాలేకాదు కష్టాలుకూడా ఉంటాయని హెచ్చరిక చేయకపోవడం న్యాయమేనా ?

★ అంత వయస్సురాకుండా అబ్బాయిలకు పెళ్ళి చేయరు. పెళ్ళికి సిద్ధపడ్డ కుర్రాడికి మాత్రం బాధ్యత లుంటాయని తెలియకాపోదు 'మ్యాట్రిమోనియల్ స్టడీస్' అనే విషయం ఇంకా ఆడపిల్లలకి కాలేజీల్లో ప్రారంభించితే బాగుంటుం దనుకుంటున్నాను అబ్బాయిలకి కూడా కావాలని మీరు ధృవపరుస్తున్నారు రామయ్యగారూ !

వి వి ఆర్., పి. వి. ఎల్. — సిద్దిపేట

భర్తలు భార్యలని గొడ్డును బాదినట్టు బాదుతూ వుంటారు. మరి భార్యాభర్తలు సమానమేనంటారేం మీరు ?

★ భార్యలు 'మనుషుల్లాగా'క 'వస్తువుల్లా' చూసేవాళ్ళే — 'నా ఇష్టం — నే చంపుకొంటా నన్నట్టు' — బాదుకోనూ కలరు, సిగ్గులేకుండా తిరిగి చేరతీయనూకలరు ! చేతకాని కోపంలో యింగితం కోల్పోయి చచ్చినట్టు పడివుండే ఓ జడపదార్థం లాంటి పెళ్ళాన్ని కొట్టి అక్కసు తీర్చుకుంటారు — కొందరు .. పెళ్ళాన్ని కొట్టైనా కాస్త పౌరుషం వున్నట్టు నిరూపించుకుందామని తాపత్రయమేగాని, భార్య దృష్టిలో యెంత దిగజారిపోతారో ఊహించలేరు అసలు పెళ్ళాన్నైనా, పిల్లలనేనా కొట్టడంలో అర్థం ఒక్కటే—చేతకాని తనానికి నిరూపణ

జె వి. ఆర్. — విశాఖపట్నం

తెలివిగలవాడి లక్షణం సెలవిస్తారా ?

★ ఎక్కువ చేయడం, దాన్ని గురించి తక్కువ మాట్లాడడం తెలివిగలవాడికి లక్షణం అనుకుంటా

—కె. రామలక్ష్మి

## రాగబంధం

[24 వ పేజీ తరువాయి]

"మీరు నాకేమీ నీతులు చెప్పనవసరం లేదులెండి! నాతో రావటం యిష్టంలేదని చెప్పండిగాని వాళ్ళనీ వీళ్ళనీ తీసుకెళ్ళమని మీరేమీ సలహా యివ్వనవసరంలేదు అవసరంవస్తే ఒక్కదాన్నే వెళ్ళగలను !"

"వెళ్ళమన్నానుగా !"

అంటూనే టై కట్టుకుని మరొక్కసారి కాలర్ సర్దుకుని బైటికి వెళ్ళిపోయాడు భాస్కర్ బాధగా విసుగ్గా టీపాయ్‌మీద వున్న నవలను తీసి విసురుగా గది మూలకి గిరవాటేసింది సుందరి ఏ నవల చదివినా, ఏ సినిమా చూసినా భార్యాభర్తలు సాయంత్రాలప్పుడు చెట్టాపట్టా లేసుకుని సినిమాలకని; పార్కులకని, తిరుగు తుంటారు తానుకూడా అలా ఒక్కరోజునయినా తాను భర్తతో వెళ్ళగలిగిందా ? వెళ్ళాలని మనసు విప్పి అడిగినా బాస్ పిలుస్తున్నాడని; ఆఫీసు పని వున్నదంటూ వెళ్ళిపోవటం ? తానయినా యెంతసేపని పుస్తకాలతో కాలక్షేపం చెయ్యగలదు ? చెప్పినా అర్థంచేసుకోలేని భర్తమీద విపరీతమయిన కోపం వచ్చింది.

ఆరాత్రి ఆలస్యంగా వచ్చిన భాస్కర్ పదిసార్లు తలుపు తట్టితేనేగాని సుందరి తలుపు తీయలేదు కావాలనే ! ఆలస్యంగా తలుపు తీసినందుకు సుందరిమీద కోపం రాలేదు. భార్య మనస్తత్వం తెలిసివున్న భాస్కర్ చిన్నగా నవ్వుతూ తనే పలుకరించాడు.

"బాగా నిద్రపట్టిందనుకుంటా ? లేపినందుకు మరేమీ అనుకోవద్దు సుందరీ ?"

"అనుకోవటానికి ఏమున్నదిలెండి ? మీకు అలవాటేగా యిలా వేళతప్పి రావటం ?"

అంటూనే ఆవలిస్తూ వెళ్ళి మంచంమీద పడుకుంది భాస్కర్ బట్టలు మార్చుకుని కూజాలోని నీళ్ళు గ్లాసులోకి వంపుకుని త్రాగివచ్చి సుందరి ప్రక్కన చోటుచేసుకుని పడుకున్నాడు నవ్వుతూ ! వీపుమీద వున్న పమిటని తీసుకుని తనమీద కప్పుకుని సుందరిని తనవైపుకి తిప్పుకోవాలని ప్రయత్నించి విఫలుడైపోయాడు

"నామీద కోపం వచ్చింది కదూ ?. " లాలనగా అడిగాడు

"రాదేమిటి ?" తల తిప్పకుండానే జవాబిచ్చింది

"ఉద్యోగ ధర్మం అలాంటిది !"

"దానికి జవాబు నేనూ చెప్పగలనిప్పుడు ?" ఋంగమూతి పెట్టింది

"అరగంటనుంచీ చెప్తూనే వున్నావు అలకపాన్పు ఎక్కి ! నాకు నిద్ర వస్తోంది మరి !"

"హాయిగా ఆ ప్రక్కకి తిరిగి పడుకోండి !"

"అలాగే! ముందు నీ అలక తీర్చి !" అంటూ బెడ్‌లైట్ తీసేసి సుందరిని బలవంతంగా దగ్గిరకు తీసుకున్నాడు భాస్కర్ ! భాస్కర్‌కి తెలుసు ! భార్యకి కోపం వచ్చిందని గ్రహించితే సాగతియ్యకుండా తనే ప్రసన్నం చేసుకుంటాడు భార్య కోపం తాత్కాలికమయినదనే సంగతి తెలుసు ! అలాగే అతి కోపిష్టిగల భార్యతో సర్దుకుపోవటం అలవాటు చేసుకున్నాడు... ..

[ఇంకా వుంది]

## ప తు లు

(18వ పేజీ తరువాయి)

సందుకు ఏమంతగా బాధపడలేదు పైగా సంబర పడ్డట్టు దాని ముఖం నిండా వెలుగు చూశాడు మూర్తి.

*   *   *

సాయంత్రం అయిదయ్యింది

ఆకాశం బాగా మబ్బుపట్టి వుంది. గాలి దురుసుగా వీస్తోంది.

పెరట్లోని ఎండిన రావి ఆకులు ఎగిరొచ్చి లోగిట్లో పడుతున్నాయి. మడత కుర్చీలో పడుకున్న మూర్తి మీద కూడ పడడంతో తెలివొచ్చినట్టై — ఆలోచన్ల నుంచి తేరుకున్నాడతను.

వాటాలలోని వాళ్ళంతా వీధుల్లోని ధూళి గదులలోనికి చొరబడుతోందని తలుపులు బిగించు కుంటున్నారు.

వాతావరణం చూసి లేచి మూర్తి కుర్చీ మడత పెడుతున్నాడు.

వుంటూన్న గది నుంచే ఇల్లరికపు అల్లుడు పెద్దగా కేకపెట్టి అడుగు తున్నాడు.

'కారంపూడిలో వర్షాలెలా వున్నాయంటా.'

గాలికి ఆ ఎత్తు అరుగుల మేడ ఇంట్లోని వారంతా సందడి సందడిగా వున్నారు.

ఇంతలో—

తులసి—ఆమెతో ఒక అపరిచిత వ్యక్తి ఆ ఇంట్లోనికి జొరబడ్డారు. ఆ వ్యక్తి తులసికన్నా రెండడుగులు పొడవున్నట్టుగా వున్నాడు. పుష్టిగా— హుందాగా వున్నాడు. ఖరీదైన బట్టలు వేసుకున్నాడు. కావల్సినంతగా మూర్తిని చూసి నవ్వుతున్నాడు.

కూతురు తండ్రికి ఆవ్యక్తిని పరిచయం చేసి, సంగతి చెప్పింది.

అతనిపేరు హరి. వాళ్ళ కంపెనీ మేనేజరట! కొన్నాళ్ళు మిలటరీలో పనిచేశాట్ట! అతన్ని ఆమె— ఆమెను అతనూ ప్రేమించు కున్నార్ట! త్వరలో వాళ్ళిద్దరూ వివాహం చేసుకోబోతున్నార్ట! ఆశీర్వదించ మంటు న్నారు.

మూర్తి కుర్చీని వారగా పెట్టి 'ఒసే' అంటూ భార్యని కేకేసి— విషయాన్ని విడమర్చి చెప్పాడు. 'సోద్యం' అని ముక్కు మీద వేలేసుకున్నా తర్వాత 'రఃదు జోడు' కుదిరిందని తృప్తిపడి హృదయపూర్వకంగా ఆశీర్వదించిందావిడ.

మూర్తి దీవించాడు.

ఆ సమయంలో— అతని మనసులో కూతురిపట్ల ద్వేషంగాని, విధి పట్ల కోపం గాని, అతనిపట్ల అతనికి ఏవగింపు గాని కలగలేదు. కాని,

'రెక్కలొస్తున్న పడుచు గూళ్ళని వెతుక్కుంటూ ఎగురుతున్నాయి' అని మాత్రం అనుకున్నాడు. అలా అనుకుంటున్నప్పుడు అతని కళ్ళంట రెండు కన్నీటి చుక్కలు రాలి పడ్డాయి.

వాటిని ఏమని పిలవాలి!? ఆనంద బాష్పాలనా! విషాదాశ్రువులనా? ఏమని?! ఏమని?!

''శంకరశాస్త్రిగారి వీణా వాయిద్యం రేడియోలో స్టార్టింగ్ ట్రబులున్నమోటారు ఇంజనులాగ ఎలా వుందో వినండీ'' అంటూ మూర్తికి దగ్గరగా ట్రాన్సిస్టర్ పట్టుకు వచ్చి నిలబడ్డాడు ఇల్లరికపు అల్లుడు అయిన ఇంటి ఓనరు.

''వెదరు బాగోలేక'' అందామను కుంటూన్న మూర్తి దగ్గుతో విలవిల్లాడి పోతున్నాడు.

## తా జా కా లం

(7వ పేజీ తరువాయి)

కొంతమంది విద్యార్థుల్ని పోలీసులు పట్టుకు పోయారుకూడాను.

దేశంలో యూనివర్శిటీలు జిల్లాకొకటి చొప్పున వస్తున్నాయి! ఎక్కడో అక్కడ యూనివర్శిటీలో అల్లర్లులేకుండా దేశంలో సూర్యోదయం అవడంలేదు.

జలపాతం లాంటిది 'యువత' దీన్నుంచి విద్యుచ్ఛక్తి చేసి గ్రామాల్ని వెలిగిస్తారో? లేక యీ మహోధృతలో వెల్లువని ఇండ్ల మీదకి మళ్ళించి వాటిని ముంచేస్తారో? అది తేల్చుకోవలసింది యీ దేశం, యీ వ్యవస్థ—అంతే. దాంతో జలపాతానికేం సంబంధం లేదు ...

''పొలిటికల్ బాసెస్'' యూనివర్శిటీలని — ముందుతరం దేశ సౌభాగ్యం కోసం ఎప్పుడు వదిలేస్తారా? అన్నదే సామాన్యుని ఆందోళన!

[ వీరాజీ ]

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతీ రోజు ఉత్సాహంగా, ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతీ ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకొనడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి.

బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతీ

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL-1

# ఆమె ఎన్నిక

గంటి సుందరీ కౌసల్య



ఆనంద్‌కు రోజూ బీచికి వెళ్లటమంటే సరదా. తన యింటికి బీచ్ దగ్గర కావటంతో ఆఫీసు పని పూర్తయిన తరువాత బీచ్‌లో దూరంగా సముద్రం - మబ్బులు కలిసినట్లుండే ప్రదేశాన్ని గంటల తరబడి చూస్తూ, వూహలు నిర్మించుకుంటూ వుండి పోయేవాడు.

ఆ రోజు కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లాడాలంటూ బీచ్‌కి కవితను ఆహ్వానించాడు ఆనంద్. తన గుండెల్లో పదిలంగా దాచుకున్న యీ విషయాన్ని కదిపిమాడాలని అతని అంతరాత్మ పదే పదే తొందర పెడుతోంది. ఇన్నాళ్ళుగా కవితకు తన హృదయంలో స్థానమిచ్చాడు. తన ఆఫీసులో స్టెనోగా పనిచేస్తూ నలుగురితో కలిసి మెలిసి అరమరికలు లేకుండా నిర్మలంగా వుండే కవిత అంటే తనకు చెప్పలేని యిష్టం. ఇప్పుడు కవిత వచ్చిన తర్వాత తన మనోభావాలను వెల్లడించాలి. ఈ వూహాలోకంలో పడ్డ ఆనంద్‌కు ఎప్పుడు కవిత వచ్చిందీ తెలియలేదు. ఒక్కసారి ఆశ్చర్యపోయాడు.

దూరంగా సూర్యుడు మబ్బుచాటు చేసుకుని ఈ లోకంనుంచి వెళ్లిపోయే ప్రయత్నంలో వున్నాడు. చిరునవ్వులు చిలకరిస్తూ వచ్చిన కవిత అలాగే యిసుకలో 'హమ్మయ్యా!' అంటూ కూలబడిపోయింది. ఇప్పటిదాకా ఆలోచనలతో నిమగ్నమైన ఆనంద్‌కు కవిత రావటంతోనే ఎలా తను చెప్పదలచుకున్నది చెప్పాలో బోధపడలేదు. కొద్దిసేపు వారిద్దరిమధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ కవిత.

''ఆనంద్‌గారూ! ఎందుకో రమ్మన్నారు కారణం తెలుసుకోవచ్చునా?'' అంది.

''ఇన్నాళ్లూ కవితలో ఆఫీసులో చనువుగా మాట్లాడుతూ వున్నప్పటికీ యీ విషయాన్ని ఎలా మొదలుపెట్టాలో తికమక పడిపోతున్నాడు ఆనంద్.

''కవితా! ఎన్నాళ్ళుగానో నా మనసులో పదిలంగా దాచుకున్న విషయం చెప్పే అవకాశం యిప్పటికి దొరికినందుకు నాకు సంతోషంగా వుంది. నేను రమ్మని కబురు పంపటంతోనే వచ్చావు. చాలా సంతోషము. ఇప్పుడు నా పెళ్లికి ఎన్నెన్నో సంబంధాలు వస్తున్నట్టుగా పెద్దవాళ్లు రాస్తున్నారు. కాని నా మనసులోని నిన్ను చెరిపివేసి మరొకర్ని పెళ్లి చేసుకోలేను. నీవు అనుమతిస్తే...'

''మీ తల్లి దండ్రుల్ని సంప్రదించి నన్ను వివాహం చేసుకుంటానంటారు అవునా? ఆనంద్‌గారూ కాని నా నిర్ణయాన్ని తెలియజేసే ముందు నా కుటుంబ వ్యవహారాలు చెప్పకోవాల్సిన బాధ్యత నాపైన ఉంది అన్నీ విన్న తర్వాతే మీ నిర్ణయం తెలియజేయండి.''

సరేనని ఆనంద్ తల వూపాడు.

''మా నాన్న రిటైర్డ్ స్కూల్ టీచర్. రిటైర్‌మెంటుతో పాటు కొన్ని జబ్బుల్ని ఆస్తిపాస్తులుగా సంపాదించాడు. నాకు పెళ్లి కావాల్సిన చెల్లెలొకతుంది. కుటుంబమంతా నా మీద ఆధారపడి బ్రతుకుతున్నారు నేను మిమ్మల్ని పెళ్లి చేసుకొని యినతలకి వస్తే మా కుటుంబాన్ని ఎవరు పోషిస్తారు? మీరు బాగా ఆలోచించే ఒక నిర్ణయానికి రండి'' అంది కవిత.

ఆనంద్ వెంటనే అందుకున్నాడు. ''కవితా! నీవు యీ విషయంలో బెంగపడవద్దు. నేనిప్పుడు గుమాస్తాగా నెలకు ఐదువందలు సంపాదిస్తున్నాను. ఈ డబ్బు మనకు హాయిగా సరిపోతుంది. నీ జీతంతో మీ నాన్నకు మందు మాకు యిప్పించవచ్చు మీ చెల్లెలి పెళ్లికి కట్నం యివ్వొచ్చు.''

''ఆనంద్‌గారూ! మీరు బాగా ఆలోచించే ఒక నిర్ణయానికి రండి. ప్రస్తుతానికి సెలవ్'' అంటూ నిష్క్రమించింది కవిత.

* * *

కొన్ని రోజుల తర్వాత. సమయం అదే స్థలం అదే: బీచ్ వొడ్డున ఈసారి మాట్లాడుకొంటున్నది మాత్రం రాజశేఖరం— కవిత.

రాజశేఖరం కవిత వంక చూశాడు. కవిత మోములో చిరునవ్వు ఆభరణంగా శోభిస్తోంది. కవిత చెబుతోంది.

''నా పరిస్థితులు మీకు తెలియజేశాను రాజశేఖంగారూ! ప్రేమా, గీమా అంటూ పెళ్లికి ముందు చెట్టాపట్టాలేసుకు తిరగటం అంటే నా కిష్టంలేదు. నాకుటుంబ పరిస్థితులు మీకు చెప్పాను. ఇక మీరు బాగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి.''

''కవితా! ఐ యామ్ వెరీ వెరీ సారీ! మీ కుటుంబ పరిస్థితులకు నా సానుభూతి! కాని నేను మీ కుటుంబం కోసం ఎటువంటి త్యాగం చేయలేనని తెలపటానికి చింతిస్తున్నాను. అదృష్టవశాత్తు నాకు సంపాదించే భార్య లభిస్తే పొదుపుగా జీవిస్తూ యిద్దరి సంపాదనతో ఆర్థిక యిబ్బందులు లేకుండా జీవించాలనేది నా జీవితాశయం.

# ఇదిగో...సరసమైన ధరలో
# ఓ సాటిలేని షాంపూ
# మిస్టీ

మీ జుట్టు ఏ రకానికి చెందినది? ఏ రకమైతేనేంటేంటి. ఆ జుట్టుకు తగిన ఓ షాంపూని మిస్టీ అందచేస్తుంది.

మిస్టీ బ్యూటీ షాంపూ మామూలుగా ఉండే జుట్టు కోసం. అది జుట్టును ఆమూలాగ్రంగా శుభ్రపరుస్తుంది. ఆ జుట్టుకున్న తళతళలాడే అసలైన అందాన్ని తీర్చి దిద్దుతుంది.

మిస్టీ లెమన్ షాంపూ నూనె ఓడే జుట్టుకోసం. అది మీ జుట్టుకు సజీవాకృతిని తెస్తుంది. ఆ జుట్టు పరిమళం చిందిస్తూ నవనవలాడేలా చేస్తుంది.

మిస్టీ హెర్బల్ షాంపూ పొడిగా ఉండే జుట్టు కోసం. మీ జుట్టుకు కావలసిన సహజమైన మూలపదార్థాలన్నీ గలది. మీ జుట్టును మెత్తగా, మృదువుగా, దువ్వుకునేందుకు బలే వీలుగా రూపొందిస్తుంది.

ఇదంతా...అదే సరసమైన ధరలో. బాగా ఖరీదైన షాంపూ కూడా ఇంతకన్న మేలుగా ఏం పనిచెయ్యదు.




1904వ సంవత్సరంనుండి నాణ్యమైన ఉత్పాదనలను తయారుచేస్తున్న బోస్కో యొక్క ఉత్పాదన.

**వనితలకు మనవి**

కొత్తరకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ వీలు —సం.

# ఆమె ఎన్నిక

నేను మీకు స్వార్థపరుడిగా కనబడవచ్చు. కాని నా భార్యకు ఐశ్వర్యం, హోదా సమకూర్చటమే నా ధ్యేయం. నా మాటలు కటువుగా వున్నందుకు అన్యథా భావించకండి "

ఇద్దరూ ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు

*   *   *

'పోస్ట్' అనే కేకతో ఆనంద్ ఊహాలోకంనుంచి వూడి పడ్డాడు కవరు. కవరులోపల ఓ శుభలేఖ. లెటరు ఉన్నాయి. ఆత్రంగా విప్పిచూశాడు.

ఆనంద్ గారికి నమస్తే!

ఈ ఉత్తరంతోపాటు నా పెళ్లి శుభలేఖ పంపుతున్నాను. మా వివాహానికి మీరు తప్పక రావలసినదిగా కోరుతున్నాను. కాని మీరు ఆశ్చర్యపోవచ్చు. మా కుటుంబానికి నా జీతాన్నే త్యాగంచేస్తానన్న మీ త్యాగబుద్ధి నన్ను ఆనందింపజేసింది కాని ఏ సినిమాలలోనో, ఏ నవలలోనో పాత్రలు త్యాగభరితమై కన్నీరు కార్పిస్తుంటే మనం ఆ పాత్రల ఆదర్శాలకు, ఔన్నత్యానికి తల ఒగ్గుతాం. కాని ఇది జీవితం త్యాగం పేరుతో ఆత్మవంచన చేసుకోవటం ... క్షణ కణానికి బ్రతుకులో ఏదో కోల్పోయామని బాధపడటంకంటె మించిన వంచన లేదు. ఈ విషయంలో రాజశేఖరంగారు నిష్కర్షగా తన మనోభావాలను వెల్లడించి నన్ను చేబట్టటానికి కారకులయ్యారు మీ మనోభావాలను చదవటానికీ నేను ఎన్నుకొంచిన పాత్రలే 'రిటైర్డ్ టీచర్', 'పెళ్లికాని చెల్లెలు'. నా పరీక్షలో నా భార్య, సంసారం, సుఖం – సంతోషం అన్న రాజశేఖరంగారు విజయలక్ష్మిని వరించారు ఇకనుంచైనా 'నేలవిడిచిన సాము' వదులుతారని, నన్నపార్థం చేసుకోరని విశ్వసిస్తూ,

ఎప్పటికీ మీ స్నేహితురాలు,
కవిత.

ఆనంద్ ఆ ఉత్తరం చదివి అప్రతిభుడయ్యాడు!

# మాజీ మంత్రుల అరెస్టు వ్యవహారం

(5 వ పేజీ తరువాయి)

వుంటాకుంటూ వుండగా ఆమె — "బేడీ లెక్కడ? అవి తేలేదా ?" అన్నది—

"లేదమ్మా! మీరు మాజిస్ట్రేటు ముందు రేపు హాజరవుతామన్న సొంత పూచీకత్తు యిస్తే చాలు — మేం వెళ్లిపోతాం" అన్నారు వాళ్ళు —

"జామీను అక్కరలేదు— పదండ" న్నదామె.—

కాంగ్రెసు అధ్యక్షుడు బ్రహ్మానందరెడ్డి, కమలాపతి త్రిపాఠీ, నందినీ శతపథి మొదలు — సామాన్యజనం కొన్ని వేలమంది దాకా — అందించిన "గులాబీ పూలూ నూలు దండలు" అందుకుంటూ— ఎన్నికల ప్రచారానికో, ప్రాజెక్టు శంకుస్థాపనకో అన్నట్లుగా నేను "ఇందిరా ప్రియదర్శిని"నే కాని "మాజీ నియంతను" కాను అన్నట్లు నవ్వుతూ — వెళ్లిపోయింది.

జామీను తిరస్కరించడం — పోలీసు కస్టడీలో వుండటానికి సంకోచం వెలిబుచ్చక పోడం — జనసందోహం అలజడి వీటిమధ్య మూడు గంటలసేపు — కొన్ని వందలమంది పోలీసు పటాలాలతో కేంద్ర నేర పరిశోధక సంస్థ అధికారులు చెమటలు క్రక్కుకున్నారు.

## "రాజకీయ కక్ష"

"నన్ను నా ప్రజలకి దూరం చేయాలన్న కుట్ర" యిది అని ఆమె చేసిన ప్రకటనను మర్నాడుదయం చౌధురీ చరణ్‌సింగ్‌గారు ఖండించారు. ఆమెను మంత్రగత్తెల వేటలో భాగంగా ప్రతీకారేచ్ఛతో అరెస్టు చేయలేదు. మావద్ద — రెండు కేసుల ఫైలు వుందన్నారు. కాని శ్రీ బ్రహ్మానంద రెడ్డి, శ్రీ వై. బి. చవాన్‌లు — దీన్ని 'రాజకీయ కక్ష'గానే తీర్మానం చేశారు ... చట్టానికి అతీతులు కారెవ్వరు అన్న అద్భుతసాహసాన్ని జనతా "మూర్తిత్రయం" చేయగలిగిందని జనతా అధ్యక్షుడు చంద్రశేఖర్ — మరి ముగ్గురు జనతా ముఖ్య మంత్రులు 'ప్రశంస' చేసినప్పటికీ — దేశంలో ఎంతో మంది స్త్రీలూ పిల్లలూ యిందిరమ్మ అరెస్టుకు చకితులైనారు.'

ఆ రాత్రి శ్రీమతి ఇందిరాగాంధీని ఢిల్లీ



తొందరపాటు హోంమంత్రి?!

వెలుపల హర్యానాలోని ఒక విశ్రాంతి గృహంలో బందిద్దాం అనుకున్నారు కాని, ఆమె కారువెంట వందలాది కార్లున్నాయి — నినాదాల ఘోషతో ఘూర్ణిల్లే అభిమాన సందోహాలున్నాయి— ఒకచోట రైల్వే లెవల్ క్రాసింగ్ గేటు వేసి వుంది !

## "ఇందిరమ్మ ప్రశాంతత"

కారాగింది... శ్రీమతి ఇందిరాగాంధీ "ఉక్కబోస్తున్నది" అన్నట్లు కారు దిగి అక్కడే రైలుకట్ట ప్రక్కనున్న కల్వర్టు మీద కూర్చున్నది!— సి. బి. ఐ. అధికారుల నామె "ఏమయ్యా! చట్టాలు రాత్రికి రాత్రే మారతాయా? నన్ను ఢిల్లీలో 'కస్టడీ'లో వుంచమన్న మీ ఉత్తర్వులకు బదులు హర్యానాకు తీసుకుపోతారేం? నేను రాను... పదండి, ఢిల్లీలోనే మీ యిష్టమొచ్చిన చోట పెట్టండి నన్ను" అన్నది. న్యూఢిల్లీకి కారు మళ్లించారు. గెజిటెడ్ అధికారుల రెస్టు హవుస్‌లో ఆమె నుంచా లనుకున్నారు కాని— వెలుపల జనఘోష ఎక్కువైంది! కొన్ని అరెస్టులు జరిగాయి— ఆమెను అక్కణ్ణుంచి కింగ్స్‌వేలో వున్న పోలీసుల రెస్టుహవుస్‌లో వుంచారు...

## "షా కమిషన్" వాయిదా

అది ఇలా వుండగా శ్రీమతి గాంధీకి వ్యతిరేకంగా ఆమె మాజీ మంత్రుల నుంచి సాక్ష్యాలు రాబట్టు కలుగుతున్న "షా కమిషన్" సమావేశం అక్టోబర్ 4 న వి. సి. శుక్లా ప్రభృతులను విచారించవలసి వుండగా 26 వ తేదీకి వాయిదా పడ్డది !

## కాంగ్రెస్ వర్గాల ఆందోళన

బాగా కుమిలిపోయింది శ్రీ వై. బి. చవాన్... కార్యవర్గం దేశవ్యాప్తంగా అసమ్మతి తెలుపుతున్న పిలుపు యిచ్చేలోనేగా మద్రాసు, మధురై, బొంబాయి, బెంగుళూరులలో కొంత అలజడి చెలరేగింది.

శ్రీమతి గాంధీ మీదా ఆమె మాజీ మంత్రులమీద మొత్తం 4 కేసులు సి. బి. ఐ. పెట్టగా వాటిలో తొలివార్తల ప్రకారం రెండు నిందలు మాత్రం ఇందిరమ్మ మీద వేశారు ! [5–10–'77]






# ఫాలాక్షుని డైరీ

## ఇడ్లీ వీరుడు

మెట్టూరులో జరిగిన పోటీ లోని ఒక అంశం ఎవరు ఎక్కువ తిండితినగలరో అనేదట. ఈ పందెంలో మెచ్చెరికి చెందిన గోవిందన్ అరగంట, టైములో ముప్పయ్యొనిమిది ఇడ్లీలతిని ప్రథమ బహుమతి పొందాడట. ప్రభుత్వ స్కూలులో చదువు తున్న మాణిక్యం అనే అతను అదే టైములో ముప్పైయిమూడు ఇడ్లీ తిని, రెండో బహుమతి పొందాడట !

## పిరికివాడు

అరూరుకు చెందిన చెల్లప్పన్ అనే ఆయన అష్టకష్టాలూ పడి తన కొడుకు రాజన్‌కుబియుసి వరకూ చదువు చెప్పించాడట. కానీ రాజన్ బియుస్సి పరీక్షతప్పి, ఈ విషయం తెలుస్తే తన తండ్రి నరికి పోగులుపెట్టాడని భయపడి తాను పరీక్ష ప్యాసయినట్టు చెప్పాడట. అది నమ్మినతండ్రి అతనికి వుద్యోగం వెతకడానికి నీ సర్టిఫికేట్టు ఇవ్వరా పది మందినీ నీకుద్యోగం కోసం యాచిస్తాను. ఏ ఒక్కడయినా ఇవ్వడా అన్నాడట. సర్టిఫికేటు ఇస్తే పరీక్షపోయినట్టు తండ్రికి తెలిసి పోతుందని, ఆనక జరగబోయే దానికి భయపడి విషం త్రాగి తనువు చాలించాడట.

## ప్రాణమిత్రుల ఆత్మహత్య

తమిళనాడుకు చెందిన తిరుచెంగోడు అనే వూరిలో 20 ఏళ్ళ తంగవేలు, 19 ఏళ్ళ రాజన్ అనే వారిద్దరూ ప్రాణస్నేహితులట. విడిగా ఎప్పుడూ ఎవ్వరూ వారిని చూడ వీల్లేనంతగా కలసి వుండేవారట. మొన్న 28వ తేదీ 900 అడుగుల ఎత్తు కొండమీదున్న అర్ధనారిస్వామి ఆలయానికి యిద్దరూ కలిసివెళ్ళి తిరిగిరాలేదట ఇదేమని వారి తలిదండ్రులు వెతికితే కొండక్రింద రెండు శవాలూ వున్నాయట చిన్నాభిన్నమై. కాళ్ళకు లుంగీలు కట్టేసుకుని వారా కొండమీంచి దూకి ఆత్మహత్య చేసుకుని వుండుండాలని పోలీసు వూహాగానమట. అస్సలు వారు ఎందుకీ దారుణానికి పూనుకున్నారో యిరువురి తలిదండ్రులు కానీ, హితులు, స్నేహితులు గాని చెప్పలేక పోయారట.

## వింత నోటీసు

పశ్చిమజర్మనీలో విద్యార్థులైన యువకులుండె వో హాస్టలులోని వో నోటీసు బోర్డు లోని విన్నపం చాలా ఆశ్చర్యకరంగా వున్నదట. అమెరికా దేశస్థులు దయచేసి రాత్రి రెండు గంటల లోగా హాస్టలుకు చేరుకొనవలెను. జర్మనీయులు వుదయం ఆరు గంటలలోపు లేవనేకూడదు ఇటలీ వారు రాత్రి పదిగంటలు దాటాక పాటలు పాడరాదు. స్వీడను దేశ విద్యార్థులు ఆడపిల్లలను హాస్టలులోపలకు తీసుకురాకూడదు అనుందట. మరి మన దేశపు విద్యార్థులో!! అసలక్కడున్నారో లేదో!

* * *

లైసెన్సు లేకుండా తన వద్ద తుపాకీ పెట్టుకున్న నేరానికి మలేషియా నీతిమండపం వో పద్నాలుగేళ్ళ కుర్రాడికి టక్కున మరణదండన విధించిందట. దట్స్‌మచ్.

* * *

న్యూయార్క్‌లో యాభైవేలమంది బార లియులున్నారట. హాయిహనేం!! న్యూయార్క్ నగరం హిందూదేశానికి చెందినదంటే పోలా!!

## తెలివితక్కువ తిమింగలం

తిమింగిలం పిల్ల తనతల్లివద్ద రోజుకు 150 గ్యాలనుల పాలు త్రాగుతుందట. తిమింగలం ఆహార సంపాదనార్థం నోరు తెరుచుకుని పోతూంటుందట. అప్పుడు కొన్నిచేపలు ఆ తిమింగిలం నోట్లో దూరి, దానినాలికమీద కూర్చుని, నెమ్మదిగా ఆ నాలుకను తింటాయట. ఇలా కాలక్రమేణా చేపలు కొన్ని జేరి తిమింగిలం మొత్తం నాలుక తినేస్తాయట ఆనక ఆ తిమింగిలం గిలగిల్లాడి చనిపోతుందట.

## ఆత్మహత్యయే మందు

సేలం అన్నదానపట్టి అనేపేటకు చెందిన 17 ఏళ్ళ శశికళ అనే అమ్మాయి తండ్రి చనిపోయి చాలాకాలమవడం వల్ల తాను కాగితం సంచులు తయారు చేసి తల్లిని పోషిస్తోందట. ఆమె గత కొన్నేళ్ళుగా ఆస్మాతో బాధపడుతూందట. ఈ రోగానికి చికిత్స చేయించుకోలేక, భరించలేక ఆమె నూతిలోదూకి ఆత్మహత్య చేసుకుందట. సామాన్య ప్రజకందని వైద్య మొకవైద్యము గాదు, ఆ విజ్ఞానశాస్త్రమో శాస్త్రమూ కాదు! ఇతియోమతిః

# రాజు సాధించిన ప్రగతిలో ఐఓబి మహత్తర పాత్ర

రెండు సంవత్సరాల క్రితం ఒక చిన్న బడ్డీ కొట్టు నడుపుతున్న రాజు ఈరోజు నగరం మధ్యలో ఒక పెద్ద దుకాణాన్ని నిర్వహించగలగడంలో రహస్యమేమిటి?

కష్టపడి పనిచేయడం, పనిలో ముందడుగు వేయాలనే పట్టుదల, ఐఓబి సహకారము —ఇవే కారణాలు.

రాజు కార్యదీక్షను గమనించిన ఐఓబి తగిన సమయంలో అతనికి ఆర్థిక సహాయం అందచేసింది. వ్యాపారం అభివృద్ధి చేసుకోడానికి|మూడు|నెలల|విరామం తర్వాత సులభ వాయిదాలలో చెల్లించే విధంగా అతనికి అప్పు ఇచ్చాము.

ఐఓబి అందచేసిన సహాయంతో తమ వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకున్న అనేకమందిలో రాజు ఒకడు.

మీరు కూడా ఐఓబి సహాయం స్వీకరించడానికి ఈరోజునే సమీపంలో గల ఐఓబి బ్రాంచికి వెళ్ళండి. బ్రాంచి మానేజర్ మీకు కావలసిన అన్ని రకాల సహాయం అందచేస్తారు.




మీ ఔన్నత్యాన్ని కోరే ఉత్తమ మిత్రుడు

IOB-1603

# హైదరాబాద్ నోట్ బుక్

## రాజకీయ పార్టీలలో ముసలాలు :

రాష్ట్రకాంగ్రెస్‌లోను, జనతాలోను ముసలాలు పుట్టాయి. రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుని నియామకం ప్రజాస్వామికంగా జరుగలేదని శ్రీ పిడతల రంగారెడ్డి మున్నగు మంత్రులు దాదాపు పదిమంది విడిగా మంతనాలు సాగిస్తున్నారు. డాక్టర్ చెన్నారెడ్డి నాయకత్వంలో ఏర్పడే శిబిరంలో దూరుదామని మరికొందరు వేచిఉన్నారు. జనతాపార్టీ ప్రధాన కార్యదర్శి పదవికి శ్రీమతిలక్ష్మీకాంతమ్మ, కార్యవర్గ సభ్యత్వానికి శ్రీ మూర్తిరాజు రాజీనామా ఇచ్చారు. శ్రీ జయప్రకాశ్ తలపెట్టిన సంపూర్ణ విప్లవాన్ని ఆంధ్రప్రదేశ్‌లో నిర్వహించడానికి కృషి చేస్తానని శ్రీ మూర్తిరాజు ఒక ప్రకటన చేశారు. ఎవరికి వారు ఎన్నికల తర్వాత ముఖ్యమంత్రి కావాలనికలలు గంటున్నారు — అన్నారొక వృద్ధనాయకులు.

## ధరల పెరుగుదలపై కాంగ్రెస్ ఊరేగింపు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ తాలూకా అధిక ధరల నిరోధవిభాగం, నగరకాంగ్రెస్ కమిటీల యాజమాన్యాన కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో సెప్టెంబరు 19వ తేదీన ఊరేగింపు గాంధిభవన్ నుంచి, మొజంజాహి మార్కెట్, అబిద్, నాంపల్లి, ఖైరతాబాద్‌ల మీదుగా రాజభవన్ చేరింది. అధిక ధరలను నిరసించే నినాదాలు, పెరుగుతున్న ధరలను నిరోధించాలని కోరే నినాదాలు గల బ్యానర్లు పట్టుకుని పలువురు కాంగ్రెస్ నాయకులు నడిచారు. ప్రదర్శకుల ప్రతినిధి వర్గం రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ రహమతుల్లా నాయకత్వాన గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీకి ధరలను తగ్గించాలని కోరుతూ నివేదిక అందజేసింది.

## సంస్కృతాధ్యయనంపై గవర్నరు హితవు

సంస్కృతాధ్యయనం భారతీయ భాషలను నేర్చుకొనడానికి సహాయకారి మాత్రమేకాక, దేశసమైక్యానికి కూడ తోడ్పడుతుందని గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ సెప్టెంబర్ రెండవవారంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం జరిపిన సంస్కృత దినోత్సవంలో ప్రధానాతిథిగా ప్రసంగించినప్పుడు సలహా ఇచ్చారు. అధ్యక్షత వహించిన వైస్‌చాన్సలర్ డాక్టర్ జి.రామిరెడ్డి సంస్కృత వ్యాకరణాన్ని,బోధన పద్ధతిని సరళం చేస్తే ఎక్కువమంది నేర్చుకుంటారని అన్నారు. సంస్కృత శాఖాధ్యక్షుడు డాక్టర్ బి.ఆర్.శాస్త్రి ప్రసంగిస్తూ, సంస్కృతం మృతభాష కాదన్నారు. తెలుగు శాఖాధ్యక్షుడు డాక్టర్. బి.రామరాజు, ఆంగ్ల శాఖాధ్యక్షుడు డాక్టర్ ఎ.ని. సహానే ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యాలపై సంస్కృత ప్రభావం గురించి వివరించారు. రఘువంశంలోని శ్లోకాలను, డాక్టర్ బి. ఆర్. శాస్త్రి, సంస్కృతంలో అనువదించిన గాంధిజీ ఆత్మకథ భాగాలను శ్రీ గంగాధర్ పఠించారు. ప్రారంభంలో ఆర్ట్స్ కాలేజి ప్రిన్సిపాల్ సి.లక్ష్మన్న స్వాగతం చెప్పగా, వైస్‌ప్రిన్సిపాల్ డాక్టర్ పి.జి.లాల్యే ధన్యవాదాలు చెప్పారు.

## మహిళల ప్రదర్శన :

ఆచార్యవినోబాభావే 83వ జన్మదినోత్సవ సందర్భంగా సెప్టెంబరు 11వ తేదీన జరిగిన మద్యపాన నిషేధదినోత్సవానికి ముందు నగరమహిళలు సుల్తాన్ బజారు నుంచి గాంధిభవన్ వరకు ఊరేగింపు జరిపారు.రాష్ట్రంలో పూర్తిగా మద్యనిషేధం చేయాలని దేశంలో సంపూర్ణ మద్యనిషేధం అమలుకు పెట్టిన గడువు నాలుగు సంవత్సరాలను తగ్గించాలని వారు నినాదాలు చేశారు. ఊరేగింపులో పసిపాపలను చంకనవేసుకున్న మహిళలు వున్నారు. ఈ ప్రదర్శనానికి పునరావాస శాఖామంత్రిణి శ్రీమతి లక్ష్మీదేవి నాయకత్వం వహించారు. గాంధిభవన్‌లో జరిగిన సభకు అధ్యక్షతవహించిన విధానపరిషత్తు చైర్మన్ శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్య ప్రసంగిస్తూ, మద్యనిషేధాన్ని అమలుపరచని రాష్ట్రప్రభుత్వాలు అధికారంలో ఉండడానికి వీలు లేదని అన్నారు. ఒరిస్సా మాజీ గవర్నరు అక్బరలీఖాన్, మంత్రిణి శ్రీమతి లక్ష్మీదేవి, మాజీమంత్రి శ్రీ మూర్తిరాజు, రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి శ్రీ టి.హయగ్రీవాచారి, సాంఘికసంక్షేమ సలహామండలి అధ్యక్షురాలు శ్రీమతి పి.వి.చెల్లాయమ్మకృష్ణయ్య మున్నగువారు మద్యరాక్షసిని రూపుమాపాలన్నారు. మొదట శ్రీ సి.వి. చారి స్వాగతం చెప్పారు.

## ఉపశ్రుతి :

ఆరబ్ దేశాలలో దొంగతనాలు లేవట మీకు తెలుసా? అనడిగారు ఒకరు నన్ను. "అవును, నేకూడ విన్నాను లిబియా మొదలయిన దేశాలలో పనిచేసి వచ్చిన డాక్టర్ కె.ప్రభాకరశాస్త్రి వంటి వాళ్ళు చెప్పారు అన్నాను "అక్కడ దొంగతనం చేస్తే చేతులు నరికేస్తారట అని అన్నాను."అలాటి తీవ్రమైన శిక్షవిధిస్తేగాని జంటనగరాలలో దోపిడీలు ఆగేట్టులేవు అన్నారు ఆయన. "మానవత్వమో! అన్నాను. "దొంగతనం, దోపిడీచేయడం మానవత్వమా? అని ఎదురుప్రశ్నవేశారు ఆయన.

— తిరుమల రామచంద్ర.

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన, పుష్టికరమైన బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు**




బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC.GLX.36-203 TL

# మాయాజాలం మతికట్టు




## "రిబ్బన్లండోయ్ వింత రిబ్బన్లు!"

ఆ రోజు హైదరాబాదు గాంధీ భవనం కిక్కిరిసిన ప్రేక్షకులతో కిటకిటలాడుతోంది. ఏదో ఇంద్రజాల మహేంద్రజాల ప్రదర్శనట! ఎవరో 'ప్రొఫెసర్ ఓంకార్'ట మొదటిసారిగా హైదరాబాదులో ప్రదర్శన యిస్తున్నాట్ట!

ఏమిటో చూద్దామని టిక్కెట్టు కొనుక్కుని హాలులో కూర్చున్నాను.

దాదాపు గంటన్నరసేపు అత్యంత ఆకర్షణీయమైన అయిటమ్స్‌తో ప్రదర్శన జోరుగా సాగింది.

తర్వాత "రిబ్బన్లండోయ్ వింత రిబ్బన్లు" అంటూ మూడు రిబ్బను రింగులను, అందరికీ కనిపించేలా పట్టుకుని మెజీషియన్ అట్టహాసం చేశాడు.

ప్రేక్షకులలో యిద్దరిని వేదికపైకి రమ్మని పిలిచి వాళ్ళకి చెరో రిబ్బను రింగును, చెరొక కత్తెరనూ యిచ్చి, తనూ ఒక రిబ్బను రింగును, కత్తెరను తీసుకున్నాడు.

తాను కత్తిరించిన రీతిగా వాళ్ళిద్దరిని వాళ్ళకిచ్చిన రిబ్బన్లని కత్తిరించమని చెప్పాడు.

తన రిబ్బను రింగును ప్రేక్షకులకి కనిపించేలా పట్టుకుని రింగు ననుసరించి నిలువుగా కత్తిరించాడు.

మిగిలిన యిద్దరుకూడా ఆ విధంగానే కత్తిరించారు.

తర్వాత వన్... టూ... త్రీ... అంటూ పెద్ద అట్టహాసం చేస్తూ నిలువుగా కత్తిరించిన రిబ్బను రింగుని రెండు చేతులతో విడదీశాడు.

ఇంకేముంది! ఆశ్చర్యం!!

మెజిషియన్ కత్తిరించిన రింగుమాత్రం అంతే సైజు రెండు రింగులుగా విడిపోయి, ఒకదానిలో ఒకటి 'లింక్' అయిపోయాయి.

వెంటనే హాలంతా చప్పట్లతో దద్దరిల్లిపోయింది.

మిగిలిన యిద్దరు వ్యక్తులు కత్తిరించిన రింగులు మామూలుగ విడివిడి రింగులుగా విడిపోయాయి. ఈ ప్రక్రియ చూద్దానికి చాలా వింతగా వుంటుంది.

రహస్యం :— ఆ రోజు ఆ మెజీషియన్ కత్తిరించిన రిబ్బను ఆ విధంగా రెండుగా విడి 'లింక్' కావడంలో రహస్యం!

ఒక 'పూర్తి మెలిక' (ట్విస్టు) యిచ్చి రిబ్బన్‌ని అంటించడంలో వుంది.

ఇదేకాక, 'సగం మెలిక' (½ ట్విస్టు) యిచ్చి రిబ్బన్‌ని అంటించి, రిబ్బన్ రింగుని నిలువునా కత్తిరించి విడదీస్తే రిబ్బను రింగు వున్న సైజుకంటే రెట్టింపు పెద్ద రిబ్బను రింగుగా మారి ఆశ్చర్యాన్ని కలగజేస్తుంది.

ఈ మాజిక్‌ని గుడ్డరిబ్బన్లతో చేయడం కొంచెము ఖర్చుతో కూడిన పని కాబట్టి రంగు కాగితముల నుపయోగించొచ్చు.

రిబ్బను మెలిక (ట్విస్టు) గమనించకుండా వుండడానికి రిబ్బను రింగులు పెద్దవిగా వుండడం చాలా ముఖ్యం.

**గమనిక**

గేయాలు పంపేవారు వాటిలో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.



# అతిథుల్ని ఆదరించే
# మెరిసే మీ ముందుగదీ

## మురిపిస్తూ అలావేస్తే
## యిలా ఆరిపోయే మా పెయింటూ




## ..మరో మూడు చేతులు
## అదే పూతలేస్తే మరింత మెరుగుగదా!

మీయింటికొచ్చే అతిథులు మీ హోదాని మీ ముందుగదిని బట్టి అంచనా వేస్తారు. అందుకే, మీ గోడలకి ఎలాంటి పెయింట్ వెయ్యాలంటే, దాంతో మీ దర్జా, హోదా అన్నీ వాళ్ళకి చెప్పకుండానే తెలిసేలా ఉండాలి.

నెరోలాక్ సోల్జర్ బ్రాండ్ వాషబుల్ ఆయిల్ బౌండ్ డిస్టెంపర్ యొక్క ఆకర్షణీయమైన పెయింట్ ఫినిష్ సంగతి వేరే చెప్పాలా! కళ్ళను మురిపించే ఎన్నో రంగుల్లో దొరికే ఈ పెయింట్లు మీ గోడలకు ఎంతో అనువుగా నప్పుతాయి...ఏ రకంగా చూసినాసరే నిలిచే అందం...దాంతోబాటు ఎంతో పొదుపుకూడాను.

ఏళ్ళ తరబడి అదే రకంగా నిలిచి ఉంటుంది ఈ పెయింటు.



యోగించే
రంగు
యోగం

# నెరోలాక్ సోల్జర్ ఆయిల్ బౌండ్ డిస్టెంపర్

U-GND 120 Tel

# వారఫలం

— మహేష్ —

**21–10–1977 శుక్రవారం మొదలు**
**27–10–1977 గురువారం వరకు**

**మేషం:—** ప్రయాణాలు ఫలిస్తాయి. రావలసినడబ్బు అందగలదు. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

**వృషభం:—** స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు—దైవ కార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:—** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అనుకూలమైన వార్తలను వింటారు. పోటి వారిలో గౌరవం లభిస్తుంది. అధికారులవలనజరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి మీ ప్రయత్నాలు ఫలించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:—** మీ ప్రయత్నాల కు ఆటంకాలు వస్తాయి. ప్రయత్నాల్లో శ్రమ కలుగుతుంది వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:—** రావలసిన డబ్బు అందుతుంది.పోటి వారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలుబాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలోపోటివారిపోటి పెరుగుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల సంభాషణలనుజరుపగలరు. వారం ఆఖరులో ప్రయాణకు గురికాగలరు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**తుల:—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఎవరితోనూ వాదప్రతివాదాల తగవు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు:బంధువులకు సహాయం చేస్తారు. నూతనవిషయాలనుతెల్సుకొంటారు.

**ధనుస్సు:—** అనుకూలమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మకరం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయాణాలు. బాగుంటాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన సమాచారం అందుతుంది.

**కుంభం:—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలుబాగుంటాయి. స్త్రీలకుఆరోగ్యంబాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మీనం:—** వృత్తిలో శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారంమధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది, సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు: కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది. ●












# వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్

100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన
తల్లులకు విశ్వాసపాత్రమైనది

వుడ్‌వర్డ్స్ కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.

CAS OPPL-1-TE 7

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna

# ఉత్తరాలు

## చిన్న సింహావలోకనం

గత సంవత్సరం ఆంధ్రుల అభిమాన వారపత్రిక ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకులకు చేసిన సేవను సింహావలోకనం చేసుకొనడం భావ్యమైనదిగా భావించి మీ అభిమాన పాఠకుడనైన నేను మీ పత్రిక గత సంవత్సరం సాధించిన కృషిని పాఠకులకు తెల్పుతున్నాను.

ది3—9—1976నుంచి ది16-9-1977 వరకు ఒక్క సంవత్సరంలో ఆంధ్రసచిత్రవారపత్రిక 55 సంచికలు పాఠకులకు అందాయి. ముఖచిత్రాలపై అధికంగా అలంకరించబడిన ఘనత కుమారి దీప కు దక్కుతుంది. ఈ వర్ధమానతార గత సంవత్సరం పత్రికపై 4 సార్లు చోటుచేసుకుంది. తరువాతి స్థానంలో శ్రీ ఎన్.టి.రామారావు, కుమారి వాణిశ్రీ, కుమారిజయమాలిని అధికంగా, అంటే ఒక్కొక్కరు 3సార్లు ముఖచిత్రాలుగా అలంకరింపబడ్డారు. అయితే 17.9.76 ఆం.స.వా.ప. ముఖచిత్రం శ్రీమతి కె.ఆర్.విజయ ఈ 55 సంచికలపై ముద్రించిన ముఖచిత్రాలలో అగ్రస్థానం వహిస్తుందని చెప్పకతప్పదు.

ఇక సాహిత్య విషయానికొస్తే గత సంవత్సరం ఆం.స.వా.ప. లో మొత్తం 158 కథలు ప్రచురించబడినవి. ఎందరో నూతనరచయితలను సాహిత్యలోకానికి పరిచయం చేసిన ఘనత మీదే! సీరియల్స్ విషయానికొస్తే మొత్తం 13 నవలలు సంపూర్తిగా ప్రచురింపబడినవి. వాటిలో 7రచనలు రచయితలవి 6 రచనలు రచయిత్రులవి. సీరియల్స్‌లో తక్కువ వారాలు ప్రచురించబడిన రచనలు మజిలీ(రామా చంద్రమౌళి), ఉద్యోగందొరికింది (కోమలాదేవి) ఇవి ఒక్కొక్కటి 3వారాలు మాత్రమే ప్రచురింపబడినవి. ఎక్కువవారాలు ప్రచురింపబడిన సీరియల్స్ మగదిక్కు (పైడిపాటి సుబ్బరామశాస్త్రి), ఒక కన్యచెప్పినకథ (మంథా వెంకటరమణారావు). ఇవి ఒక్కొక్కటి 18 వారాలు వరకు ప్రచురింపబడినవి. నలుగురు రచయితలు కలిసి రచించగా 4 వారాలు ప్రచురించబడిన గొలుసుకథ కస్తూరి ఈ 13నవలలలో ఒకటి. ఈ13సీరియల్స్‌లో వెరైటీ కథా సంవిధానంతో, సహజత్వానికి అతిచేరువలో ఉన్న రచన ఇన్‌క్రెడిబుల్ గాడెస్ (డాక్టర్ కేశవరెడ్డి)కు ప్రథమస్థానం ఇవ్వాలి. అయితే, పాఠకులను విశేషంగా అలరించిన రచనలు వరుసక్రమంలో ఒకకన్యచెప్పినకథ (మంథా వెంకటరమణారావు), మగదిక్కు (పైడిపాటి సుబ్బరామశాస్త్రి), డాక్టర్ వనిత (గంటి వెంకటరమణ) రచనలు మాత్రమే!

ఎంతంగి రవీంద్రప్రసాద్ (కొత్తగూడెం.)

## సీరియల్

30—9—77 నాటి అక్కినేని నాగేశ్వరరావు గారి ముఖచిత్రం మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. శాంతితీరం సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుచున్నది. సి. గోవర్ధన్‌రెడ్డి, (కమల్‌కోట)

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్ ఉపయోగించండి. అతిశీఘ్రంగా ఉపశమనమునిచ్చే చెమటకాయల పౌడరు



చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకుల నుండి అతి శీఘ్రంగా ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి దశలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

2 ప్యాక్‌లలో దొరుకును — "బ్లూ" మరియు "శాండల్ వుడ్"

Glaxo nycil PRICKLY HEAT POWDER

**నైసిల్ పొందండి. చెమటకాయలను మరువండి. కేవలం 6 రూపాయల 63 పైసలు.***

* అనుమతింపబడిన రీటైల్ ధర: స్థానిక పన్నులు అదనం.

GN.77.429 J/Tel

# గోడలకు కూడా బుగ్గలుంటాయి

## వాటిని నిగ్గులు తేలించే ముద్దు ఎప్కోలైట్ సూపర్ ఎక్రిలిక్ ఎమల్షన్!

ఈ ముద్దొచ్చే బుగ్గల నిగ్గులు
నిజంగా మీ మనసును
దోచుకుంటాయి.




ఉత్తమ గృహాల
సర్వోత్తమ సౌందర్యానికి

ఏషియన్ పెయింట్స్

CASAP-30-234 TEL